# SREE

# PRABHAKARA

[AN ORIGINAL DRAMA IN FIVE ACTS]

BY

*Balakavi J. L. Narasimham*

RAJATHA PRINTING WORKS. TENALI.

 [Price As. 8.

శ్రీరస్తు.

# ప్ర భా క ర.

(అయిదంకముల నాటకము.)





గ్రంథకర్త

బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసింహము.




రజత ముద్రాలయము, తెనాలి.



[వెల రు. 0-8-0.

# ఇందలి పాత్రలు.

## పురుషులు

1. ప్రతాపుఁడు—(ప్రభాకర ప్రథమవిటుఁడు)
2. ఇందుశర్మ-(ప్రభాకరకు ప్రతాపునివలనఁగలిఁగిన పుత్రుఁడు)
3. కామశాస్త్రి-(ఇందుశర్మను పెంచుకొనిన బ్రాహ్మణుఁడు)
4. దేవయానుఁడు-(ప్రభాకర ద్వితీయవిటుఁడు)
5. సోమావసాని-సంపూర్ణలక్ష్మి యుంచుకొనిన బ్రాహ్మణుఁడు

## స్త్రీలు

1. ప్రభాకర-(కథానాయకి) [ఒక వేశ్య]
2. సంపూర్ణలక్ష్మి-(ప్రభాకరకు దేవయానునివలనఁ గలిగిన పుత్రిక)
3. శార్వాణి-(ఒక యోగిని)

[ ఇంక సూత్రధారుఁడు, నటి, రత్నసేనుఁడువత్తురు ]

షరా:— గ్రంథకర్త యనుమతి లేనిదే దీని నెవ్వరు ప్రదర్శింపగూడదు.

శ్రీరస్తు.

# ప్ర భా క ర.

[నాంది]

ఉ. కాంతలపైన మోహమున ♦ కష్టసుఖంబుల మంచిచెడ్డలన్
సుంత నెఱుంగఁజాలక వి ♦ నోదవిధిన్ బహు దుష్కృతంబు లెం
తెంతొ వొనర్చు మూర్ఖులమ♦హీస్థలి సృష్టిగొనర్చు శారదా
కాంతుఁడు ప్రేమమైఁదగు సు ♦ ఖంబులఁ గూర్చుత మీకు
నిత్యమున్.

[నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశము]

అహాహా! విచిత్ర నాటక ప్రదర్శనము. నటీ వేగమురమ్ము.

[నటి ప్రవేశము]

ఆర్యపుత్రా! ఏమి?

సూత్ర—ఏమందు వేమి? నవీనము—విచిత్రనాటక ప్రదర్శనము. మిగుల కొనియాడఁదగినది.

నటి—ఏమి! ఏమి!! విచిత్రనాటకమా?

సూత్ర—కాక - కథా సంగ్రహమిది! ఒక స్త్రీరత్నము పిల్లవాని నూయెలలోఁ బరుండఁబెట్టి యిన్నివిధముల సంబోధించుచు నిదురఁబుచ్చెను.

నటి—ఇన్నివిధములన?

సూత్ర—ఇదిగో వినుము.

తే. గీ. తనయుఁడఁట! తమ్ముఁడఁట! పిన ♦ తండ్రియఁట మ
ఱందియఁట! పౌత్రుఁడఁట! మామ ♦ యఁట! యింక

పైన మేనల్లుఁడట! యిన్ని ♦ వరుస లేమొ?
యరయ చిత్రమే కాదె యి ♦ ల్లగకు వసుధ?

నటి—ఇదియొక సమస్యకాదా?

సూత్ర—అవును. సమస్య పూర్తి చేసిరి. ఆశ్లోకము ననుసరించి ఈనాటకము వ్రాయఁబడెను.

నటి—గ్రంథకర్త యెవరు?

సూత్ర—కోరుతాడిపర్రులగ్రహార కాపురస్థుఁడగు బాలకవి జమ్ములమడక లక్ష్మీనరసింహముగారు.

నటి—వారీనాటకముకూడ మాతామహులగు జగర్లపూడి వేంకటప్పయ్యగారికే యంకితమిచ్చిరా?

సూత్ర—అవును. వారికేయిచ్చిరి.

నటి—నేటిప్రదర్శనమానాటకమా? పేరేమి?

సూత్ర—ప్రభాకర.

[తెరలో]

ప్రేయసీ! యేమినీవిచారము?

నటి—ఆర్యపుత్రా! ఎక్కడామాటలు?

సూత్ర—ప్రథమవిటుఁడగు ప్రతాపుఁడు, ప్రభాకరయు మాటలాడుకొనుచున్నవారు. రమ్ము వెళ్లుదము.

నటి—రండు. (అనియిరువురు నిష్క్రమింతురు)

[తెరపడును]

(ఇదిప్రస్థావన)



శ్రీరస్తు.

# ప్ర భా క ర.

ప్రథమాంకము – మొదటి రంగము.

ప్రదేశము—ప్రతాపుని సౌధము.

[ప్రతాపుఁడు, ప్రభాకర మాటలాడుకొనుచుందురు.]

ప్రతా—ప్రేయసీ! యేమినీవిచారము?

తే. గీ. వసుధ కూటిగుడ్డలకు లో ♦ పంబు లేదు
తొడవులెన్నియొ చేయించి ♦ తొడఁగినాను
పూఁడిగ సుఖాబ్ధిలో నోల ♦ లాడుచుండి
సంతసంబడ వేటికే? ♦ సకియమిన్న!

అవును సంతసమొందుటకుండు?

తే. గీ. భోగభాగ్యంబులున్న సం ♦ పూర్ణముగను,
తగిననగలున్న, సద్గుణుల్ ♦ తనయులున్న,
లోకమునకెట్టికొఱఁతయు ♦ లేకయున్న
నాఁడువారికి సంతస ♦ మబ్బదరయ.

అటులనే నీవును. నీకేమిలోపము నేనుచేసితి? ఇంతవిచార మెందులకు? వేగిరమె తెలుపుము.

ప్రభా—(విసుగుతో) ఏమి తెలుపవలయును? ఒకరి కర్మ ఫలములు వేఱొకరనుభవింతురా?

ప్రతా—(ఆశ్చర్యముతో) ఏమీ! నీమాటలు నాకు బొత్తుగా నర్థమగుటలేదు.

ప్రభా—అంతయర్థముకాకఁ బోయినఁబోసిందు, ఇప్పుడేమి?

ప్రతా—అబలా! నీకీ విచారమెందులకు?

ప్రభా—నాగీతకు.

ప్రతా—నీగీతయేమి?

ప్రభా—(కోపముతో) మీకు విస్పష్టముగా ముక్కుకు ముక్కువిఱిచి చెప్పలేను.

ప్రతా—(మెల్లగ) ఇంతమాత్రమునకింత కోపమెందుల కే?

ప్రభా—(విసుగుతో) బాగాయున్నదే! నాకేమికోపము?

ప్రతా—నేడేమోకాని విషాదస్వాంతవై నామీఁదఁ గినుక వహించితివి.

ప్రభా—నా కేవిషాదములేదు. మీ మీఁదనాకు కోప మెందులకు?

ప్రతా—నిన్నడుగుచున్న బ్రాప్రశ్నయే! తగిన సమాధాన మివ్వకుంటివికదా!

ప్రభా—నన్నేమిసమాధాన మివ్వమందురు? నాకు కోపము లేదు. తాపములేదు.

ప్రతా—కల్యాణీ! ఎందుకింతమూర్ఖము. సమస్త విషయముల నీకుసౌఖ్యముఁ జేకురఁ జేయుచుంటినిగదా! ఇందు నీకేమి లోపముకలిఁగినది. నన్ను కలతఁ బెట్టకుము. నీ హృదయాబ్జము నఁగల కోరికఁ జెప్పుము.

ప్రభా—ఇదియేనా యేమి మంచిమాట? లోన నిద్రపోవుచున్నాడు.

ప్రతా—మనయదృష్టము మిగులఁ గొనియాడఁ దగినది కదా!

ప్రభా—(విసుగుతో) ఆ. చెప్పశక్యమా?

ప్రతా—ఏమి? అట్లనియెదవు?

ప్రభా—ఏమీ లేదు. మీ రదృష్టవంతులే!

ప్రతా—నీవో?

ప్రభా—నాయదృష్టముఁ జెప్పశక్యమా?

ప్రతా—మనయిద్దరికి—

ప్రభా—మీలో నన్నుకలుపుకోవద్దు.

ప్రతా—(ఆశ్చర్యముతో) ఇరవురికు భేదమేమి?

ప్రభా—విచారించిన చాలయున్నది.

ప్రతా—(ఆశ్చర్యముతో) చాలా యున్నదా? చాలా యున్నదా? చెప్పెదవా?

ప్రభా—ఆఁ! పనేమియున్నది? చెప్పెదను.

ప్రతా—(నవ్వుచు) చెప్పిన తప్పేమియు లేదుకదా!

ప్రభా—మీకు నవ్వుగానేయుంటుంది. ఈపుత్రుఁడు నాకు కలుఁగుట నా దురదృష్టమే!

ప్రతా—(ఆశ్చర్యముతో) ఇదియేమి! ఇదియేమి!!

ప్రభా—మీ రేమైన ననుకొనుఁడు. నిజముగా నాదురదృష్టమువలననే యెప్పుడేనాకు దేవుఁడు బిడ్డనిచ్చినాడు.

ప్రతా—పొరపాటుపడుచుంటివి. అదృష్టమనుటకు దుర దృష్టమనుచుంటివి.

ప్రభా—కాదు. కాదు. పొరపాటేమియులేదు. అదృష్టము కాదు. దురదృష్టము. విడదీసి చెప్పెదను. దు ర దృ ష్ట ము.

ప్రతా—(ఆశ్చర్యముతో) ప్రభాకరా! దురదృష్టమేమి?

ప్రభా—విడదీసి తెలుపవలయునా యేమి?

ప్రతా—చెప్పుము. తప్పేమి?

ప్రభా—తప్పేమున్నదిలెండు.

తే. గీ. వారకాంతలకిల సుఖ ♦ ప్రదము సతము
జారవృత్తియేకాని సం ♦ సారమెంత
కాదు కావునసుతులు ర ♦ క్షకులు తల్లి
తండ్రులు గురులు బంధుగుల్ ♦ తలఁప యరులు.

ఇప్పటికైనఁ దెలసినదా?

ప్రతా—(ఆశ్చర్యముతో) కామినీ! యేమినీవాక్యములు ఇది నీకుపుట్టినబుద్ధియేనా?

ప్రభా—ఆ. నాకుఁబుట్టినదే!

ప్రతా—నమ్మను.

ప్రభా—పోనిండు.

ప్రతా—పుత్రునిపైనీకు ప్రేమలేదా?

ప్రభా—ఎవరికి పుత్రుఁడు.

ప్రతా—ఎవరికందువేమి! మనకు.

ప్రభా—నాకుకాదు. మీకుపుత్రుండు.

ప్రతా—మన యిరువురహృదయము లొకటికావా?

ప్రభా—అది మునుపటివిషయము.

ప్రతా—అనగా—

ప్రభా—మీరునన్ను ప్రేమించినానాడు... నేను మిమ్ముల చేరిననాడు ......మనయిరువుర ప్రేమ యొకటియైనానాడే! మనయిరువురహృదయము లొక్కటియైనానాడే!

ప్రతా—లావణ్యరాశీ! యేమియీయసందర్భప్రలాపములు?

ప్రభా—ఇంకయేమున్నది? కాలముమారినది. అస్పృష్టరేఖతొలంగినది. క్రైవమనుకూలింపదు. వియోగము—

ప్రతా—(చెవులుమూసుకొని) వినంజాల వినంజాల. నన్నుగూర్చియైన నాపుత్రునిపై నీయపూర్వకటాక్ష వీక్షణములం బరపరాదా?

ప్రభా—దుఃఖప్రదమగు సంసారగోష్ఠిలోం బడమందురా?

ప్రతా—సారంగనేత్రీ! నిన్నునమ్మియుంటిని.

ప్రభా—నాసుఖముల నేను బుద్ధిపూర్వకముగా విడనాడంజాలను.

ప్రతా—నాపైంగూడ నీకుప్రేమలేదా?

ప్రభా—ఇప్పుడు తగ్గినది. ఇంకతగ్గుచున్నది. ముందు నశించిపోవును.

ప్రతా—ఈ ప్రేమలో నిన్నిమార్పులు కలుంగకుండుట కేదియైన మార్గమున్నదా?

ప్రభా—లేదు. వియోగమే !

ప్రతా—(విషాదముతో) అబలా ! దుస్సహము.

సీ. కనుల పండువుకాగ ♦ కల్యాణి ! నిన్నుఁజూచి
మోహవారాశి నే ♦ మునిఁగినపుడు
పలుకుందునని ని ♦ న్నేణాక్షి ! చేతిలోఁ
జెయివేసి నమ్మికఁ ♦ జెలఁగినపుడు
మేలంబులాడుచు ♦ బాలరో ! నీతోడ
చాల ప్రతిజ్ఞల ♦ సలిపినపుడు
క్రీడాబ్ధిలోమున్గి ♦ చేడియ ! నీవయి
భ్రాంతిచే సంతసం ♦ బడినయపుడు

తే. గీ. ఎట్టి ప్రేమతో సంతస ♦ మెంత చెంది
తిరిఁగినాడనో వసుధ యీ ♦ శ్వరున కేలుక
కరుణనశియింపనీకు న ♦ న్నాసిపెట్టి
పోవనున్నావు నాకేమి ♦ త్రోవ ? యబల !

ప్రభాకరా ! నాహృదయేశ్వరీ ! నిన్నువిడనాడి యుండగలనా? నాపై నీకెందుకింతయలుక ? (అనిదుఃఖించును)

ప్రభా—నా హృదయమును నేను మఱల్పుకొనఁజాలను. నాసుఖముల నేను విడనాడనోపను. దుఃఖప్రదమగు సంసార గోష్ఠి లోపడుట కిచ్ఛగింపను. ముమ్మాటికి నాకు సమ్మతము కాదు.

ప్రతా—పంకజాక్షీ ! నిన్నునమ్ముకొని నేనుంటిని. నన్ను నమ్ముకొని నీవుండఁగూడదా ?

ప్రభా—అటులయిన పుత్రుఁడెవరిని నమ్ముకొనియుండును.

ప్రతా—(మెల్లగ)అదియేయాలోచింప వలసినవిషయము?

ప్రభా—నేనిదివఱకే యావిషయముఁగూర్చి యాలోచించియుంటిని. కర్తవ్యము స్థిరపఱచితిని.

ప్రతా—నీయాలోచన మంచిదికాదు.

ప్రభా—నాయుద్దేశ్యమున కంతకంటె మంచియాలోచన లేదు.

ప్రతా—అటులయిన నిప్పుడేమి సేయనుంటివి?

ప్రభా—ఎన్నిమారులు చెప్పవలయును. వియోగము.

ప్రతా—(దుఃఖముతో) నన్నువిడనాడి పోవుదువా?

ప్రభా—నిశ్చయముగా.

ప్రతా—పుత్రుని--

ప్రభా—వానిరక్షించుభారము మీయదియేకాని నాది కాదు. నాకు పుత్రుఁడుకాడు.

ప్రతా—సరోజనేత్రీ! నీవేనాకు లేనప్పుడింక యీపుత్రుడు నాకెందులకు?

ప్రభా—అటులయిన వానినికూడ కొనిపోయెదను లెండు.

ప్రతా—ఎక్కడికి పోయెదవు?

ప్రభా—ఆవిషయము మీకెందులకు?

(అని నిష్క్రమించును)

ప్రతా— స్త్రీల బుద్ధులు చంచలములు. కపటములు, బహుజనబాధకరములు. ఆడువారికందము ప్రాణోపద్రవము, విరోధహేతువు దుర్వ్యాపారమూలము అబలల సాహస

మమోఘము. లోకనింద్యము, అతివల ధైర్యము దుష్కార్య
సాధకము, నిష్ప్రయోజనము, 'స్త్రీబుద్ధిః ప్రళయాంతకః' అనో
క్తి రిత్తయగునా? నాప్రాణేశ్వరి- ప్రభాకరబుద్ధి యెంతలో నెం
తగామారినది! కారణము...ఏమని చెప్పుదును? పుత్రకుని జన్మ
ము బిడ్డలుకలుఁగుట యదృష్టమే కాని దురదృష్టమా? హృద
యేశ్వరీ! యేమిభ్రమపడితివి? ఎంతయాలోచనలేనిదానవైతివి
నీసుఖజీవనమునకు పుత్రకుఁడేమి యాటంకము? సంసారగోష్టి
లోఁబడుట కిచ్చగింపవు. వియోగమందువు. నన్నెడబాసిపోవు
దువా? అంగనా! నిన్నుఁజూడకఁ బ్రతుకఁగలనా? ఇంక నాకే
మిసౌఖ్యము? పుత్రకునితో నెక్కడికి పోయెదవన్న సమాధాన
మీయక నిరాకరించితివి. నీప్రయత్నముఁ దలఁచుకొనుచున్న
గుండెలు బ్రద్దలగుచున్నవి. దుఃఖము పొంగిపొరలివచ్చుచున్నది.
ఓదార్చువా రెవ్వరు? వియోగము నిక్కమని ముమ్మారు
దృఢముగా నొక్కి చెప్పితివి. నాయదృష్టరేఖ తొలఁగినది. ప్ర
భాకరా! పుత్రకునిఁ గొనిలేచి పోయెదవు కాఁబోలు! ఎవ్వఁడెట్టి
తపముఁ జేసుకొని యెందుండెనో! (ఆలోచించి) నీవు నన్నెడ
బాసిపోయినను పుత్రునిఁజూచుకొనుచు బ్రతికెదననుకొన్న వాని
నిందుపోషించువారలెవ్వరు? ఆడువారికిష్టములేని పనుల మగ
వారు స్వతంత్రించి చేయుట కష్టము నిష్ఫలము. తనయునిపై
నాకు ప్రేమకలదు. ప్రభాకర నన్ను విడచిపోయిన సుతునిఁ బెం
చుచు సుఖముగఁ గాలముగడుపుదు ననుకొన్నమాత్రమున
నాతలపులీడేరునే! వేశ్యాసూనుని నాభార్యపోషించునా? నా
యాట దానికడసాగునా? ఏమి యాలోచన? (కొంచెమాగి)
సౌభాగ్యవతీ! ప్రభాకరా! వియోగదుఃఖము కడుంగడుదుర్భర

మని మొఱఁగియు నీబుద్ధిని మఱల్చుకొనఁ జాలకుంటివికదా! నీకు నాకును ఋణమప్పుడె తీరినదా? ఆహా! భగవానుని సృష్టి మిగుల చిత్రమైనదికదా! ప్రభాకరా! ప్రభాకరా! నీకడసారి మాట...నీకడసారిముద్దు...నీకడసారి ప్రేమ...

(తెఱపడును) (అనిదుఃఖించును)

---

రెండవరంగము.

ప్రవేశము—అరణ్యమార్గము.

(పుత్రకు నెత్తుకొని ప్రభాకర నడచిపోవుచుండును.)

పడుపువృత్తి హేయ్యమే! అదికలస్త్రీలకు సంసారమంతకంటెను హేయ్యము. వేశ్య సంసారముచేయుట మిగుల హాస్యాస్పదము. ప్రతాపుఁడు నన్ను రెండువత్సరములు పోషించినవాడు. కొంతవఱకు సౌఖ్యమనుభవించితిని. కాని యీ సుతుని జనన మాసౌఖ్యమున కికముందాటంకమాయెను కదా! కానిమ్ము. అయిన నిప్పుడు నాకేమి కొదువ? జారవృత్తిలో మెలఁగుదానికి జన్మాంత మొక్కవిటుఁడేనా సౌఖ్యమిచ్చువాడు! అనేకులు. ప్రతాపునికడ నిఁక నాకు సౌఖ్యము లభింపదని యాతని విడచితిని. వేఱొకనిఁ బట్టెదను. ఈ తనయుఁడు నాకేల? వీనిపై ప్రేమయెందులకు? ఈయరణ్య ప్రదేశమున నెక్కడైన వీనిఁ బాఱవైచిపోయి వేఱొకనిఁజేఁబట్టి సుఖాంబుధి నోలలాడెదను. వేశ్యనై జన్మించిన నేను వ్యభిచారవృత్తిలోఁ దిగుఁగుట దూష్యముకాదు. (నలుదెసలఁ జూచి) ఎవ్వరు వచ్చుటలేదు. మంచి సమయమే! పట్టిని

కడసారి ముద్దిడుకొనియెదను. (అని ముద్దుపెట్టుకొనును) భగవానుఁడా! వీనికి రక్షకుఁడవైనను, భక్షకుఁడవైన నిఁక నీవే! (అని సమీపమున నున్న పొదలోఁ బరుండఁబెట్టి నిష్క్రమించును.)

(అలసటతో కామశాస్త్రి ప్రవేశము)

అబ్బా! యెండ తీక్ష్ణముగానున్నది. భుక్తాయాస మెక్కువైనది. దాహమగుచున్నది. నాలుకపై తడిబొత్తుగా నాగిపోయినది. అరణ్యమధ్యప్రదేశముఁ జేరితిని. ఇందు నీరము లభించునా? బొత్తుగా మనుష్యసంచారమే లేదుకదా! ఒక కొలను కాని, యొక తటాకముకాని, యొక కూపముకాని యిందెందు నున్నట్లు కనఁబడదు. రామ! రామ!! కొంచెము సేపు తరు నీడ విశ్రమించెదను. భుక్తాయాసము తగ్గును. ఎవరయిన తోడు దొరకిన కొంచెముచల్లఁబడిన తరువాత ప్రయాణము కావచ్చును.

(అని విశ్రమించును.)

(ఆలకించి) ఏమి యీధ్వని? ఎక్కడనుండి వచ్చుచున్నది. (అని లేచి కూర్చుండును.) పిల్లలయేడుపు వలె నున్నదే? ఈయరణ్యమధ్యమున యేపిల్లలుందురు) పోయి చుట్టూపరికించి చూచెదను. (అని లేచి పొదదగ్గరకు వెళ్ళును.) ఈపొద నుండియే ధ్వనివచ్చుచున్నట్లున్నది. చూచెదను. (అని పొద నంతయుఁజూచి) ఈపసికూన నేకూర్మిసులో యిందుపాఱవైచి పోయిరెకదా! ఈబిడ్డకు తల్లిదండ్రులెవరోకదా! ఈతనికిట్టి స్థితి రాఁగతమేదియోకదా! అయ్యో! పిల్లవానిఁ జూచినకొలఁది

జాలికలుగుచున్నది. మంచి తేజోవంతుఁడుగా కనఁబడుచున్న వాఁడు. పిల్లలు లేనివాఁడనగు నాకు భగవానుఁ డీబిడ్డనొసఁగెను. వీనిఁ గొనిపోయి పెంచుకొనియెదను. (అని పొదలోనున్న బిడ్డ నెత్తుకొనును) ఈపసికూన నీఘోరారణ్యమున పొదలో జార విడుచుట కెవరికి చేతులెట్లాడెనో కదా! మగవారికింత సాహస ముండదు. ఇట్టి బుద్ధి కలుఁగదు. ఇది స్త్రీల కృత్యమైయుం డును. ఔరా! స్త్రీలెంతపనులకైన సాహసముకలవారుకదా! ఈ బాలకునకిందు శర్మయని పేరుఁబెట్టుకొని తీసుకొనివెళ్ళి పెంచుకొనియెదను.

(అని నిష్క్రమించును.)

(తెరపడును.)

---

మూఁ డ వ ర ం గ ము.

ప్రదేశము—దేవయానుని సౌధము.

(దేవయానుఁడు, ప్రభాకర మాట్లాడుకొనుచుందురు.)

దేవ—అంగనా !

సీ. సంయమీంద్రులనైన • సత్యమార్గముఁ దప్పి
యలరజేయునది మో • హంబుకాదె?
పృథివీపతులనైన • వెతలిచ్చిబాధించు
నట్టిది తలప మో • హంబుకాదె?
పుట్టుబీదలనైన • పూర్ణకలఁతవెట్టు
నట్టిది వసుధ మో • హంబుకాదె?

ధార్మికులనుకూడ ♦ ధర్మహీనులఁ జేయు
నట్టిదియరయ మో ♦ హంబుకాదె?

తే॥ గీ॥ సజ్జనులనీతిశాలుర ♦ సాధుగుణుల
వారువీరననేల యీ ♦ వసుధనంత
యమర మోసించునదియె మో ♦ హంబుకాదె?
అబల! మోహ మెవరికుండ ♦ దరయ చెపుమ.

పిపీలికాది బ్రహ్మపర్యంతము మోహము బాధించును, మోసించును, పీడించును. దానికంతములేదు. అట్టి మోహాంబుధిలో నేనుమునిగిపోతిని. నీవుకదాయిక నన్నుద్ధరించుదానవు. నీవయినేకదా నాయాశలన్నియునున్నవి. నిన్నుచూచుకొనికదా నేను బ్రతుకవలశినదికల్యాణీ!—

ప్రభా—ఏమియీ యపూర్వప్రేమ?

దేవ—లేమా!—నా ప్రేమయపూర్వమా?

తే. గీ. నెలఁత! యేనాడునినుజూచి ♦ కలఁతఁజెంది
చిత్తజునివాడితూపుల ♦ జిక్కినాడ
నవనియానాడె నీకుచె ♦ ల్వారనాదు
సర్వమునుధారవోసితి ♦ సత్యమిదియె

ఇంక నాప్రేమ యపూర్వమని వాదింపఁగలుగుదువా?

ప్రభా—వేశ్యలను వంచింప భగీరథప్రయత్నములఁ జేయు విటులకిదియొకయుక్తి—మాయావిలాసము-కపటనటన

దేవ—ప్రభాకరా! నావిషయమై నీవన్యథాతలఁపవలదు.

ప్రభా—అన్యథా యెందులకు?

తే. గీ. ఉన్నదున్నట్లు తెలుపుట ♦ యుత్తమంబు
లేనివానిని కల్పించి ♦ లెస్స చెపుట
యున్నవానిని చెప్పక ♦ నూరకుంట
మోసకృత్యములగుఁగాదె ♦ మోహనాంగ?

మోసకారులగు విటులకుండు లక్షణములివియని చెప్పితిని.

దేవ—అబలా! నన్నందరివలె నెంచవలదు.

ప్రభా—(విసుగుతో) ఇప్పుడీస్వస్తి యెందులకు?

దేవ—తొలువొల్త ప్రతాపుఁడనువాడు నిన్ను రెండువత్సరములు పోషించెనని తెలిపితివి. నేనసమర్థుఁడను కాను. ఆజన్మాంతమునిన్ను నేను పోషించెదను. అనుమానమువలదు. భయము వలదు, నీవునాకడనుండుము. అంతయు బాగుగ నేయున్నది. కాని నిన్ను ప్రతాపుఁడేలవిడచిపెట్టెనో తెలిపెదవా?

ప్రభా—నేనేమిచెప్పిన మీరేమినమ్మెదరు?

దేవ—నెలతా! నీవిషయమై నాకెట్టి యనుమానము లేదు. నీ వేమిచెప్పినను నాకునమ్మకమే.

ప్రభా—ప్రతాపుఁడు నన్నిఁకపైనపోషింపఁజాలక పోయెను. అయిననాతని కడనుండుటకు నాహృదయము సమ్మతింపలేదు. నాబుద్ధిమారినది. ఆతనిపై నాకసూయ జనియించినది. ప్రతాపునకుసంసారబాధ యెక్కువైనది. అందువలననే నాతనివిడచి వచ్చితిని.

దేవ—నీవియోగమాతనికి సమ్మతమేనా?

ప్రభా—అతని యుద్దేశ్యములతో నిఁకనాకేమిపని? నా

వియోగమాతనికి సమ్మతమైన నసమ్మతమైనను నాకుమాత్ర మిఁక నందుండుట సమ్మతముకాదు. ప్రతాపుని వీడివచ్చితిని.

దేవ—(మెల్లగదగ్గరకు జేరి) పఁడతీ! నేను ప్రతాపుని మాదిరివాడనుఁగాను. నిన్నుపోషింపఁజాలని స్థితినాకులేదు. మీాదు మిక్కిలి సంసారబాధలుకూడ నాకంతగాలేవు. నీపైనాకు మిగుల యనురాగముకలదు. నాహృదయము నీకర్పించితిని. నాసర్వస్వమునీయది నాప్రేమ నిష్కళంకము నీవే నాప్రాణ పత్నివి. నిన్ను నేను నమ్ముకుంటిని. ప్రభాకరా! ఆ చంద్రతారార్కము నిన్ను పోషించెదను.

ప్రభా—ఈమాటలిప్పుడెందులకు? కానిందు.

దేవ—హృదయేశ్వరీ! యొకసారి కౌఁగిలినిమ్ము

(అనికౌగిలించుకొనును)

ప్రభా—విటులు సమయాసమము లెఱుఁగరుకదా!

(అని యిరువురు నిష్క్రమింతురు)

[తెఱపడును]

---

నాల్గవరంగము.

ప్రదేశము—ప్రతాపుని సౌధము.

[ప్రతాపుఁడొంటరిగా విలపించుచుండును]

వియోగదుఃఖ భరము మానవులు భరింపవలశినది కాదు. దుస్సహాము నాహృదయేశ్వరి ప్రభాకర నన్నువీడినది మొదలు నాహృదయవేదన యేమందును? ఇదియెట్లునశియిం

ఆవియోగముఁగూర్చి నాకింతదుఃఖమేల? పరిచారకప్రాణ సమానురాలు. ఇంపుడుక త్తెయే! అయిన నింత మోహమా! ఇట్టి యజ్ఞానమా! ఈలాటి భ్రాంతియా! తగదు. తగదు. తగదు. రోజులెల్లకాలము మానవులకొక్క రీతిగనుండవు. అవియే నాకుచెడు రోజులు! మంచివివియే! దుర్వ్యాపారము లడంచు చుందును. సద్గుణపుంజముఁ గెలుచుచుందును. స్థిరకీర్తిఁ బడయ యత్నముల సేయుదును. ధన్యుఁడనగుదును.

(అనిలోపలకిఁబోవును)

[తెరపడును]





# ప్రభాకర.



ద్వితీయాంకము—మొదటిరంగము.

ప్రదేశము—దేవయానుని సౌధము.

[దేవయానుఁడు, ప్రభాకర మాట్లాడుకొనుచుందురు]

దేవ—కలికీ! చిలకలకొలికీ!

ప్రభా—(విసుగుతో) బాగానేయున్నవి మీసరసములు.

దేవ—(మెల్లగ) ఆగ్రహమెందులకు?

ప్రభా—స్త్రీజన్మమహాపాతకమైనది. అందు వేశ్యాజాతిలోఁ పుట్టుట మిగుల దురదృష్టము. పైన సంసారసంద్రములోఁ బడుట యెంతటి హైన్యము? దానిపాట్లం జెప్పశక్యమా?

దేవ—(చిరునవ్వుతో) వేదాంతమా?

ప్రభా—(కోపముతో) అవును! మఱి మీకటులనేయుండును!

దేవ—(దగ్గరకుచేరి) సరోజలోచనీ! యేమియీకోపము! పుత్రిక యంత రోదనధ్వని సేయుచున్నదేమి?

ప్రభా—"ఏమి" యని నన్నడిగిన నాకేమి తెలియును? పోయివిచారింపుఁడు.

దేవ—(ఆశ్చర్యముతో) నేటి నీయంతరంగము నాకు బాగుగా బోధపడలేదు.

ప్రభా—మీకేంములకు బోధపడును.

దేవ—లలనా! నాయందు తప్పున్నసెపుము.

ప్రభా—నిష్ప్రయోజనముగా నన్ను మీరు కదల్పకుఁడు.

దేవ—సరోరుహాక్షీ! నీతో నాకు ప్రసంగమంత నిష్ప్రయోజనమా!

ప్రభా—సందేహమేమి?

దేవ—(నవ్వుచు) నీమాటలన్నియు నేమనాకు......

ప్రభా—ఏమి?

దేవ—(మెల్లగ) ఏమియునులేదు. లోనికిఁబోయి పిల్లదాని యేడుపు మాన్పుము. మనపుత్రికారత్నము జన్మించినందులకు నాకెంతయో సంతసముగనున్నది. మనయదృష్టము లోకస్తుత్యము. పోయి వేగిరమే పుత్రిక—మనప్రాణాధారము నోదార్చుము ప్రభాకరా!

ప్రభా—(విసుగుతో) ఈమాటలన్నియు నెవరితోఁజెప్పుచుంటివి?

దేవ—(ఆశ్చర్యముతో) నీ బుద్ధియెందున్నది?

ప్రభా—నాకు తెలియదు.

దేవ—పిల్లయేడుపు నీకు వినఁబడుచున్నదా?

ప్రభా—ఎవరిపిల్ల?

దేవ—(ఆశ్చర్యముతో) సరసములా!

ప్రభా—ఆరోజులు కడచిపోయినవి.

దేవ—(నవ్వుచు) ఈసరసములే విరసములౌను.

ప్రభా—విరసములేయివి. నాబుద్ధిచలించినది. నాహృదయము మారినది. నాప్రేమ యడుగంటినది. నామోహము నశించినది. వియోగము సంప్రాప్తముకానున్నది.

దేవ— (లేచిదగ్గరకువచ్చి) ప్రభాకరా! ఏమియీకలఁత! ఏమియీకలఁత!

ప్రభా—కలఁతకాదు.

దేవ—(తెలతెలపోయి చూచుచుండును)

ప్రభా—అట్లుచూచెదరేమి?

దేవ—నీమాటలకు.

ప్రభా—నా మాటలేమి! నాకిక సంసారము మిగుల హేయము. నేనుపుత్రికను కాంచని యంతవఱకు మీమీదనెట్టి ప్రేమఁజూపితినో, మనమిరువుర మెంతసౌఖ్యముఁ జెందితిమో యీభగనంతుఁడెఱుంగును. ఆదినములుకడచినవి. పుత్రికాజననము మనసుఖజీవనమున కంతరాయమైనది. ఇఁక నెవరిత్రోవ వారిదే!

దేవ—(ఆశ్చర్యముతో) ఆఁ! ఆఁ!

ప్రభా—మీరంత యాశ్చర్యపడవలసిన విషయ మేదియును లేదు.

దేవ—(మాట్లాడకూరకుండును)

ప్రభా—మానవులకు రోజులెల్లకాల మొకరీతిగ నుండఁ జాలవు.

దేవ—ప్రాణేశ్వరీ! న్నుకల్పతపెట్టకుము.

ప్రభా—ప్రభా...కల్పత మరేమియునులేదు

దేవ—ఎందులకీమాటలు ?

ప్రభా—నిక్కముగా మనవియోగమునకు కాలము సమీపించినది.

దేవ—ప్రభాకరా! పుత్రికగతియేమి?

ప్రభా—ఆభారమంతయు నాదికాదు నాదికాదు ముమ్మాటికి నాదికాదు.

దేవ—ఇంకయెవరిది?

ప్రభా—అవిషయమునాకుదెలియదు వియోగముమాత్రముప్రాప్తింపనున్నది.

దేవ—నీకీవిపరీతబుద్దియేమి?

ప్రభా—పుత్రికా జన్మమేనాకీలాటి బుద్ధిజనింపజేసినది.

దేవ—హరి!హరి! ఆకనులు తెఱువనిపాప—ముగ్ధ—యేమిచేసినది ?

ప్రభా—అదియింక యేమిచేయవలయు? ఏమిచేయును? దాని జననమే !

దేవ—దానిపైనీకింత నిర్దయయేల?

ప్రభా—నిర్దయయే? నాదికఠినహృదయము. పాషాణసదృశము. జాలిలేదు.

దేవ—శ్రీహరీ! శ్రీహరీ! యేమిమాటలవి? లోకముమఱచితివా?

ప్రభా—నేనంతయుమఱచితిని.

దేవ—ప్రభాకరా! నాహృదయము కలఁత చెందుచున్నది. నాధైర్య మడుగంటుచున్నది. ఎందులకునన్ను బాధించెదవు. వియోగమందువేమి? నన్నెడబాయుదువా? నాకీలోకముతో నెట్టిపని యింక లేకుండచేయుదువా? చేతులార, లేక లేక మన యనుకూలదాంపత్యమునకుఁగలిఁగిన, యాపుత్రికా రత్నమును ...... పేరుప్రతిష్ఠలు లేకుండ...... ధర్మమా? న్యాయమా? ప్రభాకరా! వియోగమువలదు. వలదు. ముమ్మాటికివలదు? ఎందుకువియోగము? ఇం దేమినీకు కొఱఁత? నన్నురక్షింపుము. నేనునీయాజ్ఞానుసారము ప్రవర్తించెదను. సతీ! సతీ!

ప్రభా— ఇంక భ్రమనిష్ప్రయోజనము. నాకిందుసుఖము .....భోగము .....ప్రేమ......మోహము......సర్వము నశించినది. ఏమియునులేదు. ఒకరితనే మిఁగిలితిని.

దేవ—సాధ్వీ! వినఁజాల. వినఁజాల. ముమ్మాటికినివినఁజాల నింకనిందుండఁజాల నాకున్మాదము జనియించినది. నాహృదయము.... .చెప్పజాలను నన్ను పలుకరింపకుము. నీబిగియారుకౌగిటనన్ను భద్రముగా...భద్రముగా... ప్రభాకరా! భద్రముగా కాపాడుము. వియోగదుఃఖభరమప్పుడే నన్ను... ...పుత్రిక — నారతనాలపుత్రికా — నాప్రాణాధారము నాసౌఖ్యాధారము—స్థితి......కల్యాణీ! ఒకసారిముద్దిమ్ము. రమ్ము. రమ్ము.

ప్రభా—నాహృదయము పాషాణముకూడకాదు. ఇంక పైది నమ్ముఁడు. (అని లోపలికిఁబోవును)

దేవ—హృదయేశ్వరీ! ఎక్కడికిపోతివి. నేనురావలదా? (అని లోపలికిఁబోవును)

[తెరపడును]

---

## రెండవరంగము.

ప్రదేశము—అరణ్యమార్గము.

[పుత్రికనెత్తుకొని ప్రభాకర నడచిపోవుచుండును]

తే. గీ. సారరహితంబు ఘోరసం ♦ సారగోష్ఠి
శ్రమలకిఅవైనలావు సం ♦ సారగోష్ఠి
సత్యమార్గేతరంబు సం ♦ సారగోష్ఠి.
జగ విదూరంబు తలప సం ♦ సారగోష్ఠి.

ఆ. వె. భయము, చింత, పెనువి ♦ పత్తులు, కష్టము,
లరులబాధ, లప్పు, ♦ లాశ, ప్రబల
సద్గుణనశియింపు, ♦ సంసారగోష్ఠిలోఁ
బడినవారికుండు ♦ పుడమియందు.

ఆ. వె. చౌర్యవృత్తి, పైన ♦ జారత్వమబ్బును,
బాధలొంది, ప్రబల ♦ వైరమవని,
గెలుపుచెందుచుండు ♦ కెరలిమనీషులు,
ఫలములేవి యందుఁ ♦ గలుగునింక ?

తే. గీ. ఎలమి కులశైలభరము స ♦ హింపవచ్చు
వీతిహోత్రునిసరసను ♦ వెలయవచ్చు
నైహికసుఖంబులను ద్రోసి ♦ యలరవచ్చు
పుడమి సంసారగోష్ఠి లోఁ ♦ బడుటకంటె.

తే. గీ. జ్ఞానశూన్యత సంసార ♦ సాగరమున
బోవువానికిఁ గడతేర్చు ♦ నావలేదు
భ్రాంతిచే మంటలోఁబడి ♦ బాధజెందు
మిడుతఁగావంగ తెలివేమి ♦ పుడమిఁగలదు.

తే. గీ. వసుధజన్మమే తతమహా ♦ పాతకంబు,
స్త్రీలపాపములందునఁ ♦ జెప్పనేల?
రోసెలంది జన్మము కడు ♦ రోతతలఁప
పైన సంసారభరము దు ♦ ర్భరముకాదె?

ఆ. వె. మొదల సుతుఁడుపుట్టె ♦ పుత్రికయిప్పుడు
కఠినమానసంబు ♦ కాన, సుతుని
మున్నె మోదమలర ♦ భూమిపాల్జేసితి,
నొనర సుతనుఁజేయ ♦ నుంటెనటులె.

ఆ. వె. పుత్రులేలనాకు? ♦ పుత్రికలేల త
లంప? యెవరువలదు; ♦ లక్షణముగ
సర్వసుఖములున్న ♦ చాలు నాకవనిపై
నిందులకును జన్మ ♦ మెత్తియుంటి.

ఇంక నాకేమియువలదు. ఈపుత్రికనుకూడ యిందెందైన పారవైచిపోదను. (నలుదెసలజూచి) ఎవరువచ్చుచునట్లు

లేదు. దీనినీ పొదచాటునఁ బెట్టెదను (అనిపొదచాటున పుత్రికఁబరుండఁబెట్టి) భగవానుఁడా! దీనికిఁక సర్వస్వమునీవే!

(అని నిష్క్రమించును)

(సోమావధాని ప్రవేశించును)

ఏమి చిత్రములుచేసినా యాభగవంతుఁడే చేయవలయును. మానవులసమర్థులు నిష్ప్రయోజకులు నిరర్థకులు. భగవంతుని సాయములేక మానవుఁడేమియుఁ జేయఁజాలఁడు. మానవజన్మకర్మముఫలము లనుభవించుటకు మాత్రమే! ఏంత సౌఖ్యమున్ననేమి, యెంతభాగ్యమున్న నేమి బిడ్డలులేని జన్మము మానవునకు నిరర్థకముకదా!

సీ॥ మంచిచెడ్డల విచా ♦ రించువారలుప్రీతి,
మానవుల కిలనా ♦ త్మజులుకాక,
కష్టసుఖంబులఁ ♦ గదిసి చూచెడువారు,
మానవుల కిల నా ♦ త్మజులుకాక,
చనువుగా ముద్దు ము ♦ చ్చటలఁ దీర్చెడువారు,
మానవుల కిల నా ♦ త్మజులుకాక,
చర్చనల్పుఁగ తమ ♦ సర్వస్వమంతయు,
మానవుల కిల నా ♦ త్మజులుకాక,

గీ. ఎవరుకలరింక తోడు మా ♦ నవుల కరయ?
ధరణి సంతానహీనతఁ ♦ దనరునరుల
జన్మమెంతయు వ్యర్థంబు ♦ చర్చసేయ
భోగభాగ్యములున్న సం ♦ పూర్ణముగను.

పుత్రులు లేరుసరే యొక పుత్రికయైన నాకు కలుఁగఁ గూడదా? ఆభగవంతునకు నాపై యింత యనుగ్రహము లేకఁబోవలయునా? ఇంతయాస్తి యున్నది. ఇంత ధన మున్నది. ఇదియంతయు నెవరిపాలుకానున్నదో? ఇంతకు నాయాస మొకనిది యనుభవ మొకనిది కానున్నది. నాతో యీవంశము నాశనముకావలశినదే! ఇంకయూరేమి? పేరేమి రామ! రామ!! ఎంతపాపము చేసితినోకదా! (కొంచెమాగి) ఎవరో యేడ్చుచుండిరే? ఈఘోరారణ్యమందు నిట్టి రోదన ధ్వని రాఁగతమేమి? ఇందెవరుందురు? ఏకు పీవైపునుండి యె విసవచ్చుచున్నది. పోయిచూచెదను. (అని పొదదగ్గరకుపోయి యందున్న బిడ్డ నెత్తుకొని) ఆహా! యిది స్త్రీకృత్యముకదా! ఆపాపాత్మురాలెవ తెయోకదా! కనులు తెఱువని యీపసి కూనఁ జేతులార నీకటిక పరిదేశమునఁ బారవేయుట కెంత సాహసురాలోకదా! కానిమ్ము భగవంతుఁడు, పిల్లలులేక యల్లాడుచున్న నాకీబిడ్డ నొసంగినాడు. తీసుకొనిపోయి పెంచు కొనియెదను. (కొంచెమాగి) ఈపసికూన తేజోవంతురాలు గానే కన్పట్టుచున్నయది. కాని కులవిషయమే......ఏమియుఁ దోఁపకున్నది. దొరకిన బిడ్డలనుఁగూర్చి కులగోత్రములు విచా రించు నవసరము పెంచువారికిలేదని పెద్దలందురు. కాననావిష యమై తర్జనభర్జనలేగదు. తీసుకొనిపోయి పెంచుకొనియెద. (అని కొంతదూరము నడచి) ఈబిడ్డకిప్పుడే నామకరణము జేసుకొనియెదను. (ఆలోచించి) ఏమనిపిలతును? ముద్దుపేరు పెట్టుకొనియెదను. పేరేమియుఁ దలఁపునకు వచ్చుటలేదే! [కొంచెమాగి] సంపూర్ణలక్ష్మియని పెట్టుకొనియెదను. ఏమి

తోంచినదోతోంచినది. ఇంక ఇదేనామము. వేగరమే పిల్లదాని కెండ తగులకుండ యింటికిఁ దీసికొనిపోయెదను.

(అని నిష్క్రమించును.)

నెలయనము|

---

## మూడవరంగము.

ప్రదేశము—దేవయాని సౌధము.

(దేవయాని యొంటరిగా విలపించుచుండును)

ప్రభాకరా! ప్రభాకరా!

సీ॥ భరియింపఁజాలని ♦ విరహవేదననాకు
సంతసమొసగునే ♦ యింతిమిన్న!
సైపంగనోపని ♦ తాపంబునాకిపుడు
మోదంబుఁగూర్చునే ♦ మోహనాంగి!
నిలువంగవచ్చిన ♦ కలఁతలునాకింక,
వేసట నడఁచునే ♦ భాసురాంగి!
బాధింపనైబడ్డ ♦ భ్రమలన్ని యాతఁడే
హర్షంబునిచ్చునే ♦ నతివమిన్న!
తే॥ గీ॥ ఎన్నిసంకటములఁ గూర్చి ♦ యేగినావు?
మఱతునేనిన్ను వేయిజ ♦ న్మములకైన?
నెంతతీరని దుఃఖము ♦ నిచ్చినావు?
జగతి స్త్రీలతలపులు చం ♦ చలములరయ.

సీ॥ నీమూర్తి పరికించి • నేచిత్తమందున
హత్తించి నీకడి • నట్టిముద్దు
దాంపత్యలీలలఁ • దనరారుచున్నపు
డెలమి నిన్జూచి నీ • కిడిన ముద్దు
నరోత్కుఁ లందున • శర్మాబ్ధిలో మున్గి
నెట్టన నీకిడి • నట్టిముద్దు
క్రీడలన్మరుగుచు • ప్రేమమైనినుఁజూచి
యెడ రెడు వేడ్కఁ నీ • కిడినముద్దు

తే॥ గీ॥ ఎన్నిముద్దులు? చెప్పఁగ • నేమి ఫలము?
మఱల నాకిచ్చియైన ధ • ర్మంబుపోవ
వెంత కాఠిన్యమూని నీ • వేగినావు?
కీరవాణీ! కల్యాణీ! ర • క్షింపరావె

(కొంచెమాగి ధైర్యమువహించి) ఛీ! యింపుడుకత్తెయుల నమ్మరాదు కదా! ఎందులకు నాకీ లేనిపోనిచింత. యంతయు భ్రాంతి. ఒకలుమఱచుట. దుర్వ్యాపారము. అలౌకికము. జగనింద్యము వలదు. జారవృత్తి వలదు. అశాశ్వతము అధర్మము బహుబాధకరము. ప్రభాకరకు నాకు ఋణముతీరినది. ఇంక దానివిషయమై నాకేట్టి చింతయువలదు. పుత్రికనుఁ దలంచుకొన్న అహా! గుండెలు బ్రద్దలయిపోవుచున్నవి. ఆక్రూరాత్మురాలు దానినేమిసేయునో? ఆబిడ్డనైన నాకడనుంచుకొనకపోతినికదా! ఎంతమూర్ఖుఁడనైతిని (ఆలోచించి) ఇప్పుడింత చింతిల్లిన ప్రయోజనమేమి? గతజలసేతుబంధనమేల? అయినదేమోయయినది. ఇంక నాకేట్టి భ్రాంతి, చింతయువలదు.

వలదు ముమ్మాటికి వలదు. భూలోకమున వేశ్యలనమ్ముకొని జీవించువాఁడెవఁడును లేడు ప్రభాకరకు నాకు నెట్టిసంబంధము లేదు. దానిబిడ్డకు నాకైన నెట్టిసంబంధము లేదు. లేదు. ముమ్మాటికి లేదు.

(అని లోపలికిఁబోవును)

(తెఱపడును)





శ్రీరస్తు.

# ప్రభాకర

## తృతీయాంకము — మొదటిరంగము

ప్రవేశము — కామశాస్త్రిగృహము

[కామశాస్త్రి యాలోచించుకొనుచుండును]

తండ్రియంతవాడు బిడ్డ యైనప్పుడు బిడ్డకనుకూలముగనే తండ్రిప్రవర్తించుచుండవలయును. భగవంతుఁ డనుగ్రహించిన పుత్రకుఁడిందుశర్మ పెద్దవాడయినాడు. ఇఁక నేను వానివివాహ మచిరకాలములోఁ జేసి యీసంసారభారమంతయు వాని నెత్తినఁబడ వేసినఁగాని నాకు విశ్రాంతికలుఁగదు. వివాహవిషయము... సంబంధములువచ్చి తిరిగిపోతూ యున్నవి. ఇంతవఱకు నాకునచ్చినదొక్కటైన వచ్చియుండలేదు. దేశములమీదకు నేనుపోవుటంత బాగుండదు. అదిమిగుల హేయము. వివాహము మాత్రము శీఘ్రముమే చేయవలయును. కానిమ్ము భగవదేచ్ఛ యెట్లుండెనో?

[ఇందుశర్మ ప్రవేశము]

తండ్రిగారూ!

కామ—ఇందుశర్మ! ఏమోయి?

ఇందు—మీకొఱకెవరో వచ్చిరి?

కామ—నాకొఱకా! ఎందుండిరి?

ఇందు—వెైటఅరుగుమీఁదఁ గూర్చుండియుండిరి.

కామ—సరి! నీవుపోయి భోజనముసేయుము. నేనువచ్చివారితో మాటలాడెదను. (అని కామశాస్త్రి వైటయరుగుమీఁదకుఁబోయి సోమావధానిఁజూచి) అయ్యా! తమరెవరు?

సోమా—రండు. కూర్చుండుఁడు.

కామ—(కూర్చుండును) పనిమీఁదవచ్చితిరే!

సోమా—అవును. మేము బ్రాహ్మణులము. శ్రీవత్సగోత్రీకులము. బందెనపల్లివారము. నాపేరు (సోమావధాని) నాకువివాహమునకువచ్చిన పన్నెండేడ్ల బాలికకలదు. దానికీయేటనే వివాహముసేయ సంసిద్ధుఁడనై యుంటిని. సంబంధమునకుఁ దిరుఁగాడుచుంటిని.

కామ—ఏమీ! శ్రీవత్సగోత్రీకులా! బందెనపల్లివారా! మాకొకవిధముగా చుట్టములని యప్పుడప్పుడు మానాయనమ్మ యనుచూవచ్చినది.

సోమా—చుట్టఱికమెట్లు?

కామ—అదేనాకంతబాగుఁగా తెలియదు. మానాయనమ్మ మేనమామకేలాగో బందెనపల్లివారు చుట్టములట! అదేబంధుత్వము?

సోమా—అలాగా! మీగోత్రమెద్ది?

కామ—మాది హరితసగోత్రములెండి. శ్రీమద్రాజు వారము.
నాపేరు కామశాస్త్రి.

సోమా—ఏమైనా చుట్టరికముండేమో లేండి.

కామ—మనకు తెలియదుకాని చుట్టరికమున్నది.

సోమా—నాకుమార్తెను మీకుమారున కిచ్చుతలంపున మీ
కడకు వచ్చితిని. బిడ్డలులేకఁ గుందుచున్న నాకా
యొక్కపుత్రికను భగవంతుఁ డొసంగినాడు. దానివిష
యమై నేను మీతో నంతగా చెప్పకొనఁ గూడదు.
కాని సద్గుణవతి. యోగ్యురాలు. మిగులరూపసి. విజ్ఞా
నవతి. ఇన్ని నేను చెప్పటెందులకు? మీరువచ్చి పిల్ల
దానిఁ జూచుకొనవచ్చును.

కామ—ఆలోచించుదము లేండి!

సోమా—అవునులేండి. ఈకాలములో నింటియాడుదానితో
నాలోచింపకుండ స్వతంత్రించి మగవాడెట్టి పనియుఁ
జేయగూడదు.

కామ—తక్కినవిషయము లెట్టులున్నను వివాహవిషయము
మాత్ర మాడువారితో నాలోచింపవలయును.

సోమా—ఏమో యాభగవంతుఁడు కొన్నరో కొన్నరో
నాకేబది యెకరముల పొలమును, దగ్గరదగ్గర పదివేల రూపా
యీల నిల్వసొక్కము, నివాసయోగ్యమగు చక్కని
గృహము సర్వస్వము నిచ్చియున్నవాడు. ఈకుమార్తె
తప్ప నాకితరులెవ్వరు లేరు. నేనిదియంతయు దానికీయ
వలసినదే!

కామ—తమ కుమార్తె పేరేమి?

సోమా—ముద్దుపేరు సంపూర్ణలక్ష్మి యని పెట్టుకుంటిని.

కామ—మంచిది. నాకునేకపుత్రుఁడు పేరిందుశర్మ. లోపల నున్నవాఁడు చూడుఁడు. ఆభగవంతుఁడు నాకుఁ గూడ తగిన భోగభాగ్యము లిచ్చియున్నాఁడు.

సోమ—తమకు భూవసతి?

కామ—ముప్పది యెకరముల భూమియున్నది. అయిదారు వేలు నిల్వరొక్కమున్నది లెండు. ఇదిగో యీగృహ మే యున్నది.

సోమా—ఇది చాలదా?

కామ—అంతేలేండి పిల్లవాని కూటిగుడ్డలకు మాత్రము మత్తేమియును లోపములేదు లేండి.

సోమా—పిల్లవాని వయసెంత?

కామ—పదునెనిమిదవ యేడిది.

సోమా—విద్య—

కామ—ఏంవిద్యలేండి? ఇప్పటికాలవు హూణవిద్యయేగా!

సోమా—అదేలేండి!

కామ—ఆవిద్యలో భగవదనుగ్రహమువలన కాస్త పెద్దపరీక్ష యందే యుత్తీర్ణుఁడై నాఁడులేండి!

సోమా—చాలండి నాకునచ్చిన సంబంధమే!

కామ—ఆలోచించుదము రండు. లోనికిఁ బోవుదము.

సోమా—వెళ్ళుదము.

(ఇరువురు లోపలికిఁ బోవుదురు) (తెఱపడును)

## రెండవ రంగము.

### ప్రవేశము—దేవయానుని గృహము.

(సోమావధాని యాలోచించు కొనుచుండును)

వివాహము సమీపించినది. అంతయు సిద్ధముచేసితిని. సంబంధముతగినదే! మంచిది. సాంప్రదాయము చాలా మెచ్చఁదగినది. పిల్లవానివిషయమై యికఁజెప్పనక్కఱలేదు. ఏమి లోపములులేవు. ఇంతకు భగవంతుఁడుఁ నాపాలిట నున్నవాడు. కానిమ్ము వివాహము మాత్రమెంతో వైభవముగా చేయవలయును, ఇంక నేను చేయుకార్యము లేమియున్నవి? ఇది యొక్కటియే కదా! వివాహమునకు ఋణము చేయవలసిన యవసరము నాకులేదు. ఏదో యాభగవంతుఁ డిచ్చినాడు. ఉన్నదానిలోనే నాశక్తి కొలఁది-దానికింత యాలోచన యెందులకు? ఎట్లు చేయుదునో?

(సంపూర్ణలక్ష్మి ప్రవేశము)

నాన్నగారూ!

సోమా—అమ్మా! యేమి?

సంపూ—ఏమిటో యాలోచించు చుంటిరే!

సోమా—ఏమిలేదమ్మా నేనాలోచించు కొనివచ్చిన సంబంధము మీకందఱి కిష్టమైనదియేనా!

సంపూ—తండ్రిగారూ! మీ యిష్టానుసారము మేము ప్రవర్తింపవలసినదే కాని మీకసమ్మతముగ ప్రవర్తింప గూడదుకదా!

సోమా—(దగ్గరకుఁదీసి ముద్దుపెట్టుకొని) అమ్మాయీ! సంబంధము మంచిది. ఎవరెట్టి వంకలు పెట్టలేరు. నీవదృష్టజాతకురాలవు.

సంపూ—సంబంధము విషయము దల్లిగారుకూడ యాలోచించిరి. అందఱికినచ్చినది.

సోమా—వివాహము సమీపించుచున్నది.

సంపూ—వంటైనది, ఇఁకస్నానము వేయవచ్చును లోనికిరండు.

సోమా—రమ్ము వెళ్లుదము.

(అనియిరువురు లోపనికిఁబోవుదురు)

[తెఱపడును]

---

మూఁడవరంగము.

ప్రవేశము—సోమావధానిగృహము.

[సోమావధాని, కామశాస్త్రిమాట్లాడుకొనుచున్నారు.]

సోమా—శాస్త్రిగారూ! అంతాభగవచ్చిత్తమండీ!

కామ—అవును. బిడ్డలులేక లేకఁగుందుచున్న నాకుభగవంతుఁడిందుశర్మ నొసంగుట. నీకు సంపూర్ణలక్ష్మి నటులేయొసంగుట. ఇందుశర్మకు సంపూర్ణలక్ష్మికి వివాహమగుట, తలవనితలంపులు, భగవచ్చిత్తములుకావా?

సోమా—ఇరువురకు దొరకినబిడ్డలే!

కామ—మొత్తముమీద మనకుకొంత దిగులుతీరినది.

సోమా—ఆహా

కామ—ఇంక మన కేమి కావలయును. వాళ్ల క్షేమమే!

సోమా—అన్నిటికిమనకు పైనభగవంతుఁడేకలఁడు.

కామ—కానిమ్ము.

[ఇందుశర్మ ప్రవేశము]

తండ్రిగారూ! మనప్రయాణ మెప్పుడు?

కామ—ఆలోచించుదము. ఎక్కడికి వెళ్లితివి?

ఇందు—ఇక్కడకే, తటాకతీరమునకు.

సోమా—శాస్త్రిగారూ! క్రొత్తగా కాపురమునకు పిల్లనుతీసు కొనివెళ్లుట కెల్లుండి బాగాయున్నది. మీప్రయాణము ల్లుండియే!

కామ—సరే! అలాగేకానీండి.

సోమా-ఇందుశర్మా! నీకునేనేమియుఁ జెప్పనక్కరలేదు. పిల్లను నేనునాప్రాణసమానముగా పెంచుకున్నాను. సుకు మారి ఇంతవఱకెండకన్నెఱుఁగదు. పనిపాటలెఱుఁగదు. ముగ్ధ. ఎంతయల్లరిచేసిన దానినేను మందలించియెఱుఁ గను. ఆబిడ్డనాయింట పడినప్పటి నుండియే నాకన్నియుఁ గలసివచ్చినవి. దానికోరికలెట్టివైనఁ దీర్చితిని. అఱ చేతిలోఁబెట్టుకొని పెంచుకుంటిని. నీభార్యగా నిప్పుడు చేసితిని. దానినెటుల యేలెదవో? సుఖపెట్టుము.

కామ—తనయా! యిందుశర్మా! మామగారి మాటల నాల కించుచుంటివా?

ఇందు—ఆ! అన్నియు శ్రద్ధతో వింటిని.

కామ—కుమార! నేనుమాత్రము నీకుచెప్పవలసిన వేమున్నవి?

సీ॥ జనదాటలేదు హా ♦ ర్షతఁ దలితండ్రుల
యాజ్ఞ స్వప్నములందు ♦ నైన సుంత
ధిక్కరింపగఁ లేదు ♦ మక్కువ గురులను
కినుకఁజెందిన వారు ♦ కేరడముగ
నిందింపలేదు క్షో ♦ ణీతలంబున నెపుడు
బుధజనంబుల గర్వ ♦ మును వహించి
మఱువంగ లేదు ధ ♦ ర్మము లెంత చెడుమైత్రి
చెనటిమూకలతోడఁ ♦ జేసిచేసి
తే॥ గీ॥ ఎఱుఁగవీవు దుష్కృతముల ♦ నీధరిత్రి,
బుద్ధిమంతుఁడవీవు సం ♦ పూర్ణయశముఁ
జెందగా ప్రవర్తింపుమా ♦ నందమలర,
తివిరియోగ్యుల కొకరు బో ♦ ధింపవలెనె?

ఇందుశర్మా! సంసారభారమంతయు నిఁక నీపైఁబెట్టితిని ఆభారము వహించి నాకు విశ్రాంతి నొసంగుము. పూర్వులు పేరుప్రతిష్ఠలనిల్పుము. మామగారి కనుకూలముగ ప్రవర్తింపుము. నీపై సర్వాశలఁబెట్టుకొని నిన్నే నమ్ముకొనియుండు సంపూర్ణలక్ష్మి నిజముగా సంపూర్ణలక్ష్మి నీధర్మపత్ని నేలుకొనుము. తల్లితండ్రుల పోషింపుము. జగన్నుతమగు యశము బడయుము.

ఇందు—(సోమావధానినిఁ జూచి) మామగారూ! (కామశాస్త్రినిఁ జూచి) తండ్రిగారూ! మీకు నానమస్కార

ములు. (అని నమస్కరించును) నేను మీయాజ్ఞాను సారముగాఁ బ్రవర్తించువాడనే మీ కసమ్మతముగఁ బ్రవర్తించువాడను కాను.

సోమా—అదేకదోయి కావలసినది.

కామ—మేము నిన్ను కోపగించినను, భయపెట్టినను, కొట్టినను, తిట్టిన నేమిచెప్పిన నీబాగుకే కాని మాబాగు నకుకాదు కదా!

ఇందు—అవును.

సోమ—సాయంసమయమైనది.

కామ—వెళ్ళి సంధ్యావందనాదులఁ గావించుకొనవలయును.

ఇందు—వెళ్ళుదము రండు.

(అని మువ్వురు నిష్క్రమించును)

(తెఱపడును)

## నాల్గవ రంగము.

ప్రదేశము:—కామశాస్త్రి గృహము.

(ఇందుశర్మ, సంపూర్ణలక్ష్మి మాటలాడు కొనుచుండును)

ఇందు—అవును అదృష్టదేవతారాధనయే కదా ప్రతివానికి

సంపూ—మనయదృష్టము మిగుల కొనియాడఁ దగినది.

ఇందు—ఆవిషయము మనమిప్పుడనుకొన వలసినదికాదు.

సంపూ—ఇప్పుడుకాక మఱి యింకెప్పుడు?

ఇందు—మనజన్మాంతమున కనుగొనవలసినది.

సంపూ—మతీ మీఁది యెక్కువ వేదాంతము.

ఇందు—కాదే! అదృష్టదేవత బుద్ధి యూహించఁజాలము. ఆ విషయము నీవెఱుఁగవు. ఎప్పుడొకని కడనిలువఁజాలదు. ప్రతివానిని మోసగించుచుండును. అందులకంటిని.

సంపూ—ఇప్పుడావిషయములు మనకేందులకు? నేటివఱకదృష్టదేవత మనకడనే యున్నదికదా!

ఇందు—ఉన్నదిలే!

సంపూ—అటుల మాటలాడద రేమి యాలోచించు చుంటి రేమి?

ఇందు—నాయాలోచనా! ఏమియును లేదు. సంసారభారము భరింప శక్యము కానిదికదా!

సంపూ—ఇప్పుడు మనకేమి కొదువ?

ఇందు—ఏమియును లేదులే! ఏదో కలఁత?

సంపూ—కలఁత యెందులకు? మీకెప్పుడును కలఁతలే!

ఇందు—ఏమిచేయుమందువు?

సంపూ—లేనిపోని కలఁతలు పెట్టుకొనకుఁడు. సంసారభారము మీఁదఁబడినంతమాత్రముననే కలఁతలేల? లోకములో నందఱుసంసారభారము భరించుటలేదా? వారందఱు మీవలెనే యెప్పుడు కలఁతలు నొందుచుండిరా? మీరి ప్పుడీరీతియున్న నాకెటులనో యుండును.

ఇందు—(సంతసముతో సంపూర్ణలక్ష్మిని కౌఁగిలించుకొని) ప్రాణేశ్వరీ!

సీ॥ నీవుకదా నాకు • నిఖిలకోర్కెలఁదీర్చి,
వంతన మొనఁగెడు • చానవరయ
నీవుకదా నన్ను • నెమ్మిపైఁ బ్రోచుచు,
శ్రద్ధఁబూజించు వి • జ్ఞానవతివి
నీవుకదా నాదు • జీవంబులనుఁగాచి,
కాంతులమూన్పెడు • కల్పలతవు
నీవుకదా నాకు • శీవిధైర్యంబిచ్చి
పోషించునట్టి పు • బోణివహహ !
తే॥ గీ॥ నీవెనాకష్ట సుఖములు • నీరజాక్షి !
నీవెనాపెన్నిధానంబు • నెలఁతమిన్న !
నీవె నాసర్వమరయంగ • నీవెనాకు,
నిన్నుఁబోలెడు సతిని యిం • కెన్నఁగలనె?

హృదయేశ్వరీ ! మన దాంపత్యమున కంతరాయము కలుఁగకుండ భగవంతుని వేడుకొనుదము.

సంపూ—నాధా ! మీకు భయమువలదు. మనదాంపత్యమున కంతరాయము కలుఁగదు. మన యదృష్టదేవతయే మనలఁ గాపాడును.

ఇందు—కాపాడవలయునుగదా !

(లోపల) ఇందుశర్మా ! ఇందుశర్మా !

ఇందు—ఎందులకో తండ్రిగారు పిలచుచుండిరే !

(అని నిష్క్రమించును.)

సంపూ— ఏమిపనిమీద పిలచియుందురు. నేనుకూడ పోయెదను. (అని నిష్క్రమించును.)

(తెలవడును.)



శ్రీరస్తు.

# ప్రభాకర

చతుర్థాంకము, మొదటిరంగము.

ప్రవేశము:— కామశాస్త్రి, గృహము.

[ ఇందుశర్మ, సంపూర్ణలక్ష్మి మాటాడుకొనుచుందురు. ]

ఇందు—సాధ్వీ !

సీ॥ స్థిరభయప్రదమగు ♦ నరకసౌధము నెక్కఁ
గుమురుగాఁ గట్టిన ♦ మొదటిమెట్టు
తతదుఃఖ సంద్రముఁ ♦ దర్కింపఁజేరంగ
వేడుకఁగూర్చిన ♦ వెసలనావ
దురదృష్టదేవతఁ ♦ దొడరిపూజింపఁగ
పొలుపారఁబెంచిన ♦ పూలతోఁట
ధర్మదేవతఁగూల్చి ♦ దహనమొనర్పఁగ
ప్రబలమై వెలుఁగొందు ♦ బాడబాగ్ని

తే॥ గీ॥ సారరహితంబు ఘోరసం ♦ సారగోష్ఠి
శ్రమలకిరువైన తావు సం ♦ సారగోష్ఠి
సత్యమార్గేతరంబు సం ♦ సారగోష్ఠి
జగవిదూరంబు తలప సం ♦ సారగోష్ఠి

ఇంతతప్ప నాకిందేమియు లాభములు కనఁబడుటలేదు.

సంపూ— ప్రాణేశ్వరా!

తే॥ గీ॥ జగతికష్టసుఖములు సం ♦ సారమందె!
పరివిధైహికస్వేచ్ఛ సం ♦ సారమందె!
ఘోరకృత్యములందును సం ♦ సారమందె!
స్వర్గభోగంబులైన సం ♦ సారమందె!
సంసారములేనియెడ జన్మ మెందులకు?

ఇందు—అబలా! ఆవిషయము మన ప్రసంగమునకు సంబంధింపదు.

సంపూ— అటులయినమీకు సంసారమునందు విరక్తి కలిగి నదా యేమి?

ఇందు— ఇంకావిరక్తి యింతవరకు కలుగలేదులే!

సంపూ— మఱి యీమాటలెందులకు?

ఇందు— సంసారభారము దుర్భరముగానున్నది. హృదయము కలంతపడుచున్నది. ఏమియు—

సంపూ— మీకు ప్రప్రథమమునుండి యిటులనే యున్నదికదా! ఇప్పుడు క్రొత్త యేమి?

ఇందు— క్రొత్త యేమియు లేదు ... బైట యెవరో చూడుము.

సంపూ— ఎవరో ముష్టికి వచ్చినవాళ్లు.

ఇందు— ఎవరో చూడుము మంచిమంచి కీర్తనలఁ బాడుచున్న వారు.

సంపూ— (వెలుపలకుఁబోయి చూచివచ్చి) ఆడుది యొక్క నీవేసమున బిచ్చమునకు వచ్చినది. మంచికీర్తనలే పాడు చున్నది.

ఇందు— బైటకుబోయి కనుగొందము రమ్ము.

(అనియిరువురు వెలుపలకుఁబోయి కూర్చుందు.)

(శర్వాణీనృత్యము సల్పుచు పాడుచుండును.)

—* కీర్తన *—

వ్యర్థముజన్మమిలపై వ్యర్థము॥ వ్య॥
వ్యర్థమైనజన్మమెత్తి-నిరర్థకులౌట హేయము
వ్యర్థము-హేయము-మానవులకు॥ వ్య॥
క్షోణియంతమాయతో నే-కూడియున్నదారియు
మానితం-బేగతి-మానవులజన్మము॥ వ్య॥
మాయలోనుమున్గిపోయి-మంచిచెడ్డలెంచక
హేయమౌ-జన్మమౌ-యేటికినరులకు॥ వ్య॥

(సంపూర్ణలక్ష్మిలోపలనుండి బిచ్చముతీసుకొనివచ్చి పెట్టఁబోవును)

ఇందు——అప్పుడే తెచ్చితివేమి? ఇంక కొంచెము సేపు పాడనీయకఁబోతివా?

సంపూ——ఎందుకు? (శర్వాణిఁజూచి) బిచ్చముపట్టనేమి?

శర్వా——(సంపూర్ణలక్ష్మి సెగాదిగఁజూచి) ఛీ! కులపాంసనీ!

తే॥ గీ॥ సోదరునిఁబట్టిభోగించు* చుంటివీవు,
పరుస వాయులసరియౌకి* ధరణియందు
ద్రోహులరాలవుసైఁబడు* దోసమిపుడె
నాకు, నీవిచ్చుబిచ్చము* స్వీకరింపఁబట్ట.

కావనీచేతిమీఁదగనిచ్చుధర్మము నాకువలదు- నేనిదే పోవుచుంటిని.

(అనినిష్క్రమించును.)

సంపూ——(ఆశ్చర్యముతో) ఏమీ! నాకితఁడు సోదరుఁడెట్లు? ఈమాటలుగడుంకడు చిత్రములుగానున్నవే! సామాన

ధానిబిడ్డను నేను. కామశాస్త్రిగారికుమారుఁ డీతఁడు కదా! సోదరుఁడౌటకు బంధుత్వమేమి? ఈయోగిని నాకుపంచికలఁత పెట్టిపోయినది. ఇందేమియోనున్నది. పోయియూ పెనే వృత్తాంతమంతయు నడిగి తెలిసికొనియెదను.

(అనినిష్క్రమించును)

ఇందు—(దుఃఖముతో) విధికృతములు జగన్నింద్యములు.

[తెరపడును]

---

రెండవరంగము.

ప్రవేశము—వీధిమార్గము.

[శర్వాణి, సంపూర్ణలక్ష్మి సంభాషించుకొనుచుందురు]

శర్వా—కుటిలాత్మురాలా! నావెనువెంట నేవచ్చెదవేల? పొమ్ము

సంపూ—అపరాధముక్షమింపుము. నాకోరికఁదీర్పుము.

శర్వా—ఛీ! ఎంతమాట! నీకోర్కెదీర్పవలయునా! నీవుమహా అపరాధముఁ జేసినదానవు. అదిక్షమింపఁదగినదికాదు. పొమ్ము

సంపూ—యోగినీమణీ!

తే॥ గీ॥ జ్ఞానశూన్యతదోసపుం* జములొనర్చి
తనరుచుండిన నన్ఁబ్రోవ* తప్పుకాదు
క్షితినియపరాధమేమిటి* చేసినాను?
తెలియఁజెప్పుము వేగమే* దిద్దుకొనెద.

శర్వా—నీవుచేసినయపరాధమునీవెఱుఁగఁజాలనియంతభాగ్యతాదశయందుంటివా?

సంపూ—నా కేమిభాగ్యకారదన?
శర్వా—మఱినీయుపరాధము నీ వెఱుఁగఁజాలవా?
సంపూ—(నమస్కరింపుచు) సత్యముగా నే నెఱుఁగను
ఎఱుఁగ దెల్పుము?
శర్వా—ఛీ! యింకను యెఱుఁగనందువేమి? నీసోదరునితో
నీవు కాపురము సేయుచున్నదానవు. ఇది యపరాధము
కాదా? మహాదోసము మ-హా-దో-స-ము.
సంపూ—(విభ్రాంతయై) ఈబంధుత్వవిశేషము సవిస్తరముగాఁ
దెలుపఁగోరెదను.
శర్వా—కాలము మించిపోవుచున్నది. నేను వెళ్లవలయునుఁ
ఈబంధుత్వవిశేషము నీకుసవిస్తరముగాఁ దెలియుటకే
నీకు యోగదృష్టిని యిచ్చితినిపొమ్మా.
సంపూ—ఇక నాతప్పు నేనేదిద్దుకొనియెదను. క్షమింపుము.
ప్రత్యుపకారము నానమస్కృతులను గైకొనుము-
(అని నమస్కరించును)
శర్వా—ఇఁకఁబొమ్మా. (అని నిష్క్రమించును).
సంపూ—నాపాలిటి దైవము... ..ధన్యను...
(అని నిష్క్రమించును)
[ తె ఱ ప డు ను- ]

---

మూ డ వ రం గ ము

ప్రదేశము—గృహము-

[ సంపూర్ణలక్ష్మి యాలోచించుకొనుచుండును- ]
ఏమి! యోగదృష్టివలన నిజవృత్తాంతము తెలియ

మున్న దే! ఇందుశర్మ నేను నొకతల్లిబిడ్డలమే! మాకిరువురకు దాంపత్యము తటస్థపడుట భగవచ్చిత్రముగాని వేరుకాదు మమ్ములఁ గన్నవెంటనే మాతల్లి పారవైచెను ఇందుశర్మను కానుశాస్త్రియు, నన్ను సోమావధానియు - యిరువురుబిడ్డలు లేనివారలే- కాన - సంతసముతోఁ బెంచుకొనిరి- వివాహముఁ జేసిరి- పాపము వారికి మాత్రము మానిజవృత్తాంతమేమి తెలియును? తెలియునెడల నింతచేయుదురా! మాతల్లియింత క్రూరకార్యమున కేల సాహసించెనో? ఇప్పుడెందుండునో? ఎవరో? నామమెయ్యదో దానివృత్తాంతము మాత్రిమా యోగదృష్టి వలననైనఁ దెలియుచున్నదిగదా! మాయిరువుర బంధుత్వము మాత్రము స్పష్టమైనది- ఐహికభోగములపై యాశవదలెను- ఇంతకాలమునుండి నేనొనరించిన నాయీ పాపములకుఁగాను సర్వస్వము త్యజించి యీయింటనే యోగిని వేసము ధరించి మెలఁగుచుండెదఁ గాక! ఇది నాసోదరుని గృహము నేనుసోదరిని- (అనియూరకుండును-)

[దీనవదనుఁడై యిందుశర్మ ప్రవేశించును]

హృదయేశ్వరీ!—

సంపూ—ఇఁక నట్టిసంబోధనవలదు- నీవునాకుసోదరుఁడవు- మనమిరువుర మొకతల్లిబిడ్డలము-

ఇందు—బంధుత్వము విస్పష్టమైనదా?

సంపూ—ఆ- అయినది- నిజవృత్తాంతము గ్రహించితిని-

ఇందు—అటులయిన నింక ముందు జరుఁగవలసినదేమి?

సంపూ—మాటేమియు లేదు- ఐహికభోగముల త్యజియించి యోగినీ వేసమున నాజీవితాంతమువఱకు నీయింట

మెలఁగెదను, సమ్మతింపవా!

ఇందు—సోదరీ! అంతకంటె యింకేమి కావలయును?

సంపూ—నీవు వేఱొకకన్యను వివాహమాడుము- సుఖముగ నుండుము

ఇందు—[తలవంచుకొనును]

సంపూ—అనుమానమువలదు-

ఇందు—యోగినీవేషముధరించి నీవు జీవనమంతయు నిరర్థకము చేసుకొనుటకంటె నేనుఁగూడ వివాహము చేసెదను-సమ్మతింపవా?

సంపూ—సోదరా! యిట్టులు పలికితి వేమి? నీ తెలివితేట లేమిటిపాలు చేసితివి? మఱచిపోయితివా? అజ్ఞానుఁడవా! ధర్మాధర్మవిచక్షణఁ జేయ నసమర్థుఁడవా? నీకీ దురాలోచన యెట్లుపుట్టెను? ఎవ్వరైన జెప్పిరా! నేను నీయింట నుండుటకు సమ్మతింపనని దేశదేశములు యోగినీవేసముతోడనే భైక్షుకవృత్తి చేసుకొని బ్రతికెదను- నా కష్టసుఖములు నీవు విచారించనక్కఱలేదు- పాపమ్ము శ్రమపడి నిరర్థకముగ అర్థము వెచ్చించి నాకు శుభకార్యములు చేయనక్కఱలేదు- నామూలమున నీవు చెడిపోవలదు- నావిషయముఁగూర్చి చింతఁజెందవలదు- కాని నిన్నొకటి వేఁడెదను- యోగినీవేసమున దేశదేశముల గాసివడుచు భైక్షుకవృత్తిచే మెలఁగుచున్న సంపూర్ణలక్ష్మి సోదరియని మాత్రము మఱువవలదు- సోదరా! నమస్కారము-

(అని నమస్కరించును)

ఇందు- (దుఃఖముతో) చెల్లెలా! యీపలుకులు నేను వినజాల నిక్కింత కాఠిన్యమువలదు. నిన్ను పోషించుటకుఁగాని, నీ కష్టసుఖములు పరిపాటి విచారించుటకుగాని, నీయాజ్ఞానుసారము మెలఁగుచు రక్తప్రేమ వెలిబుచ్చుటకుగాని, యీసోదరుడు- పాపిష్ఠిసోదరు డుండ దిక్కులేనిదాని వలె- నీవు భిక్షుకవృత్తిలో మెలగుదువా? సంపూర్ణలక్ష్మీ! ఈమాట నాకు కర్ణకఠోరముగ నున్నది. స్వేచ్ఛగా నీవునాయింటనే మెలఁగుము. నీమాటకు నేనె దురాడను. నీయిష్టానుసా[illegible]ము నేను ప్రవర్తించెదను. అమ్మాయీ!

సంపూ——అన్నయ్యా! దుఃఖము[illegible]. నీయింట నేయుండెదను. నీవుమాత్రము వివా[illegible] చేసుకొనవలయును.

ఇందు——[illegible]దరీ! ఆవిషయము[illegible] యిటుపిమ్మట యాలోచించుదములే!

సంపూ——వెళ్లుదమురమ్మ.

(అనియిరువురు లోనికిఁబోవుదురు)

[తెఱపడును]

---

## నాల్గవరంగము.

### ప్రదేశము——వీధిమార్గము.

[ఇందుశర్మ యాలోచించుకొనుచు పోవుచుండును]

వివాహముగుయాశ యింకఁదొలఁగిపోయినది. ఇదినాకెట్టికాని యీయాశ యిప్పుడు తొలఁగుట యేమి? ఏనాఁడు నా యదృష్టదేవత నన్నొదిపయివిడినదో, యేనాడు దురదృష్టదేవత

నా నెత్తిపై తననివాసమేర్పఱచుకొనియెనో. యేనాడు నాభాగ్యరాసి నాతపోఫలము—నాజీవితేశ్వరి—సంపూర్ణలక్ష్మికిని నాకును దాంపత్యము.........

దాంపత్యమేది! పొరపాటు పొరపాటు. సంపూర్ణలక్ష్మి నాకుసోదరి. సోదరి. ముమ్మాటికిసోదరి. ఆనాడేకదా నా ఐహికభోగేచ్ఛయంతరించినది! ఆనాడేకదా నాకుసర్వాశా పరిపూర్తియైనది! దైవమా! యీపాపిష్ఠిబ్రతుకు నాకెందులకు? భార్యలేనిజన్మము మానవునకు నిరర్థకముగదా!

సీ॥ తనసౌఖ్యముల వీడి ♦ ధవుని సౌఖ్యములకు
బదపడి శ్రమఁజెందు ♦ భార్యకాదె?
సంసార భారము ♦ శ్రమకొంతెఁ బాఁబూను
ప్రమదంబుతో నిల ♦ భార్యకాదె?
పతి కష్టసుఖముల ♦ భ్రమవిచారించును
ప్రాణములిచ్చియు ♦ భార్యకాదె?
పెనువిపత్తుల నడ్డు ♦ కొనితగఁ కష్టము
బడునట్టిదారయు ♦ భార్యకాదె?
తే॥ గీ॥ భార్యయేకాదె నరుని జీ ♦ వంబులన్ని?
భార్యయేకాదె నరునకు ♦ భాగ్యరాశి?
భార్యయేకాదె నరుని స ♦ ర్వస్వమరయ?
భార్యలేనట్టి నరుజన్మ ♦ ఫలమదేమి?

(కొంచమువిచారించి) మానవుని యైహికభాగ్యమునకు భార్యలేకపోయిన కొండవపక్షము నింపుటకు త్తె నాకదియు లేదు. శ్రద్ధతో ఈవిషయము నేనువిచారించలేదు. కాని యిప్పుడు కత్తె వొందకఁబోవునా! దొరకును. అదియైన నీకయాంతో

చింపెదను. (అని కొంతదూరమునడచి) అహో! ఎవతొ వచ్చుచున్నరంభ! క్రొత్తముఖమే! విచారించెదను. అని (నిలువఁబడి) చూడఁ జూడ సౌందర్యవంతురాలుగాఁ గనబడుచున్నయది. యేమియూనడక! వేశ్యవలెనున్నదే! కావచ్చు. ఆహాయాలు, అపిలాసములు అకులుకులు, ఆయోయూరములు ఆతళుకులు, బెళుకులు, నన్నియువిచారింప యదియొక వేశ్యగానే తోచుచున్నయది. ఇదిసమ్మతించిన నే నింపుడుక త్తెయగా దీనిఁజేసుకొనియెదను. వేశ్యయేమి? సమ్మతింపక పోవుటేమి? దగ్గరకువచ్చినది. (ఆశ్చర్యముతో) ఏమీ?

తే॥ గీ॥ ఆతలోదరి వాల్జూపు, • లావిలాస
ములు, భళీ! యూదరహాసిత • మోము నాయొ
యూరపునడక, యూచేష్ట • లన్నితలఁపఁ
యువిదననుఁబట్టభ్రాంతిమై • నున్నదేమొ?

కానిమ్ము అంతయుఁ దెలియకఁబోవునా?

(అనియూరకుండును)

[ప్రభాకర ప్రవేశము]

ప్రభువులకు నమస్కారములు. (అనినమస్కరించును)

ఇందు—ఎవరునీవు?

ప్రభా—నేను వేశ్యను. మిమ్ముబోటివారల నాశ్రయించుకొని యుండుటకుఁగా నీగ్రామము వచ్చితిని.

ఇందు—(తనలో) నాయాశ నీడేరనున్నది. కానిమ్ము ఇంక ఇప్పుడేమి మాటలాడెదను. ఏమియుఁదోచకనున్నదే! (ప్రకాశముగా) ఇప్పుడెక్కడకుఁ పోవుచుంటివి?

ప్రభా—ఈగ్రామమున నిందుశర్మగారను నొకరు భార్యా విహీనులై యుండిరనియు, వారికడ నాకుజీవనము జరుగుననియు గ్రామస్థులందఱు చెప్పిరి. నేనిప్పుడందులకు వారికడకుఁ బోవుచుంటిని. వారిగృహ మెంత దవ్వుననున్నదో, వారింటికడ నిప్పుడుండెదరో, లేదో వారిస్థితిగతులెట్టివో నాయందు దయయుంచి నాకుఁ దెలియఁజెప్పెదరా ?

ఇందు—(తనలో) ఏమీ నాకీయనుమానము. వేగమేకొని పోయెదను. (ప్రకాశముగా) రమ్ము వెళ్లుదము.

ప్రభా—(తనలో) ఇందుశర్మ యీయనకాదుకదా ! (ప్రకాశముగా) మీరుకూడావచ్చెదరా? రండు వెళ్లుదము.

(అనియిరువురు నిష్క్రమించును.)

[ తెర పడును. ]

---

## ఐదవరంగము.

### ప్రదేశము—గృహము.

[యోగినీ వేసమున సంపూర్ణలక్ష్మి యాలోచించుకొను చుండును.]

మానవులకు కామము దుస్సహము. సోదరుఁడగుయిందు శర్మ వివాహముఁ జేసుకొను కోరిక లేకఁ గాఁబోలు నింపుడు కత్తెనుఁ దెచ్చుకొనియున్నవాఁడు. కానిమ్ము! వానియిష్టాను సారమే ప్రవర్తింపనిమ్ము! ఎంతవారికైన నెల్లకాలము నొక రీతిగ గడవదుకదా ! భగవంతుఁడిందుశర్మ హృదయమునకు

శాంతిని గూర్చుగాక! మాయిరువురి జన్మలకు యేదియాశాప మండనోపు? లేనియెడ వానికిభార్య, నాకుపతియు... నా కింక యీకలతలేమి? ఐహిక సౌఖ్యములపై నేను నాభ్రాంతి విడిచితిని. ఇక నాసోదరుఁడే! వాఁడుకూడ యింకఁ గొన్ని నాళ్లకు... ఇందుశర్మ మునుపటికింటె యిప్పుడుకాస్త కాస్త కళాకాంతులు గలిఁగినవాడయినాఁడు. అనగా హృదయమున సమస్త దుఃఖముల మఱచి పోవుచున్నవాడు. నాయందు మంచిభావముతోనే మెలఁగు... ... రక్త ప్రేమకదా! భగవంతుఁడుమాకు సర్వకాల... ...ములఁ జేకూర్చుచుండు గాక! (... లోపలికిఁబోవును.)

[ తె... ...ను ]





శ్రీరస్తు.

# ప్రభాకర

——:o:——

## పంచమాంకము—మొదటిరంగము

ప్రదేశము—గృహము.

[ కామశాస్త్రి, సోమావధానిమాటలాడుకొనుచుందురు. ]

కామ—అవధానులుగారూ! కాలమంతా మారిపోయినది లెండి!

సోమా—ఆహా! యందుకు సందేహమేమున్నది? మనగౌరవములు, మనపేరుప్రతిష్టలు తగలబడ పోవుకాలము వచ్చినది. ఏమియనుకొని యేమిప్రయోజనము?

కామ—నోరుమూసుకొని కూర్చుండుటమేలు.

సోమా—అంతకాక యింకామనముచేయునది యేమున్నది? ఇంటిశాస్త్రికు బొత్తుగా నీభయముభక్తులు పోయినవిగా!

కామ—ఇప్పుడా? చాలాకాలమైనది.

సోమా—ఇంతకూ వానిచిత్తము కలతపడిపోయినది. సంపూర్ణలక్ష్మి వ్యవహారమో?

కామ—ఇంకావానివ్యవహారమేమిటి? దానికిప్రపంచకపు గొడవ యేపట్టదు.

సోమా—దీనికంతకుకారణమూ ముష్టికివచ్చిన యోగిని—శర్వాణియేగా!

కామ—అపశాచమే!

సోమా—ఇప్పుడిందుశర్మ ప్రభాకరయనే వేశ్యను పెట్టుకొని యున్నవాడా?

కామ—ఊఁ వానికర్మము లేండి!

సోమా—కులభ్రష్టుఁడైనవాడు. ఇఁక నీయింటిలో నీవుండుట తగదు. ఇందు నీకింక యెవరు? భార్యాచిన్ననాడే గతించినదికదా!

కామ—తగకఁబోయిన యెక్కడికిచావను? నాకర్మము

సోమా—ఏమి! నాయింటికిరమ్ము ఏదోభగవంతుఁడిచ్చినది యింతయాస్తి, డబ్బునున్నవికదా! కూటికుడ్డలకు బ్రతికినన్నాళ్లు మత్తేమిలోపముండదు. సౌఖ్యముగా యనుభవించుదము. మనయిరువురయాంతమున కేదియైన మిగిలిన యిందుశర్మయే యనుభవించును. అక్కడ యొకరినిర్బంధము లేదు.

కామ—(దుఃఖముతో) చివఱకెంతస్థితివచ్చినదండీ!

సోమా—దుఃఖించిన ప్రయోజనము లేదు. నాగతికూడయంతే కదా! మనయిరువుర పూర్వపుణ్యములటువంటివి.

కామ—అవశ్యమనుభోక్తవ్యం కృతంకర్మ శుభాశుభం. యను సుధీజనవాక్యము రిత్తకాదు.

సోమా—కామశాస్త్రీ! సమస్తము తెలిసినవాడవు. ఎందుకునీకింత వెఱ్ఱి. ఇఁక యిందుమనపనియైపోయినది.

కామ—అవును.

సోమా—ఇందుశర్మ యాభోగందాని నెక్కడ తెచ్చినాడు?

కామ—ఏమో? త్రాష్టపుముండ యెక్కడదొరికినదో?

సోమా—దానిని తెచ్చి రెండుసంవత్సరములు కాలేదా?

కామ—అయినది- ఒక మొగశిశువు కూడజన్మించినాడు?

సోమా—హరి! హరి!! ఇఁక యిక్కడుండుట మహాదోషము.

కామ—అందువలనే వాడిముండను తెచ్చినప్పటినుండి నేను దేశ దేశములు తిరుగుచూయుంటిని. వ్యవహారములెట్లు న్నవో చూచిపోవుదమని నిన్ననే యిక్కడికివచ్చితిని. అంతయుఁజూచితిని—

సోమా—సరే! నీవునాయింటికిఁక ప్రయాణముకావలసినదే!

కామ—కానీండి వెళ్లుదములెండి.

సోమా—నీకనుమానమువలదు.

కామ—అనుమానములేదు వచ్చెదను. వెళ్లుదము.

సోమా—భోజనకాల మతిక్రమించుచున్నది. ముందుభుక్తికి వెళ్లుదమురమ్ము.

కామ—కేశవరావుగారి యింటికేకదా!

సోమా—వారే మనకీగ్రామమునగతి. వెళ్లుదమురమ్ము.

(అనియిరువురు నిష్క్రమింతురు)

## రెండవరంగము.

ప్రదేశము—కామశాస్త్రిగృహము.

[ ఇందుశర్మ యాలోచించుకొనుచుండును. ]

నాజన్మయట్టిది. అపకీర్తికే నేనుపుట్టితినికానికీర్తికికాదు. నాజీవితమునకేమి మార్పుకలిగినఁ? నేనెంత లోక నింద్యుండనైతిని. మంచియాలోచనలోఁబడిన నాదుష్కృతంబులన్నియు నాకేనింద్యములుగ నుండును. ఇట్టినాస్థితికి గారణము......

మోహమేకారణము. మోహముచేగదా వేశ్యను—ప్రభాకరనుఁబట్టి కులభ్రష్టుఁడ నైతియు, కష్టసుఖములకన్నిటికోర్చి పెంచి పెద్దవానినిగఁ జేసిన తండ్రిని దూరనాడుటయు, నాతఁడు దేశములపాలగుటయు నన్ని తటస్థమైనయవి. నాతండ్రిగారు మామగారు కాదు కాదు తండ్రిగారే—సోమావధానిగారు, నిక్కడకు వచ్చినాస్థితిఁగాంచి మిగులవిచారఁబడి చేయునదేమియు లేక కేశవరావుగారియింట భోజనముఁ జేసి యెక్కడికో వెడలిపోయిరి. వారిక్కడ కేగుదెంచినప్పుడు నేనువారికాళ్లపైఁబడి నేచేసిన యపరాధములకు క్షమార్పణఁ గోరుకొన్ననెట్లుండెడిదో? వారినిఁజూచితినా! పలుకరించితినా! ఆ దురదృష్టదేవత నన్నట్టులాడించుచున్నది. ఈరీతిగ నేనపఖ్యాతి పాలు కావలసియున్నప్పుడు నాకు సద్బుద్ధిజనించునా? ఎన్ని మాటలనుకొని నేమిప్రయోజనము? నేనుచేసిన పాపముల కంతములేదు. లేదు. ముమ్మాటికి లేదు. ఈపాపములఫలములు కొన్నియైన నీజన్మయందే యనుభవింతును. నాకీజన్మమునకు నాపాపపిశాచములు తప్ప వేరెవ్వరు సాయములేదు. ఉన్న వారితో సంబంధము తెగిపోయినది. మానవులజీవితములలో మార్పులనేకములు కదా!

(అనియూరకుండును)

[ ప్రభాకర ప్రవేశము ]

ఏమియాలోచించు కొనుచుంటివి?

ఇందు—ఎవరు? ప్రభాకరా! రమ్ము. ఆలోచన యేమియును లేదు? ప్రపంచకవిషయములు-

ప్రభా—అంతరహస్యమైన నాకుఁజెప్పవద్దులేండి!

ఇందు—రహస్యములుకావు.

ప్రభా—కామశాస్త్రిగారు, సోమావధానులుగారును, వెళ్లరా యేమి?

ఇందు—నిన్ననే సనిరి.

ప్రభా—ఏమిచెప్పిపంపితిరి?

ఇందు—వాళ్లతో మాటలాడినదెవరు?

ప్రభా—మీరుమాటలాడక పోయిన వారైన మిమ్ముఁబలుక రింపలేదా?

ఇందు—నేనువారికసలు కనఁబడలేదు.

ప్రభా—వారిరువురు నన్ను మిగులనిందించిరఁట!మిమ్ము చెడకొట్టినదినేనఁట! నామాటలువిని మీరు కులభ్రష్టులైతిరఁట! ఇంకయేమోనాకు జ్ఞప్తిలేవు నన్నుచాలాచాలా మాటలనిపోయిరఁట! ఇవియన్నియు నెందులకు? నాప్రశంశవారలకెందులకు?

ఇందు—ప్రాణేశ్వరీ! నేనేమియు నెఱుఁగను. అయినవారిమాట నీవేలపాటింపవలయును? వారెవరో? నీవెవతివో? సంబంధమేమి? నిష్కారణముగాఁ గలఁతపడకుము.

ప్రభా—మీకేమి? వారటులనేయందురు నన్నన్నిమాటల నిరో యూరివారినడుఁగుఁడు తెలియును. ఆమాటలువిన్నవారెల్లరు ఆశ్చర్యపడిపోయిరి. నాపిల్లవానిని రత్నినేను నెన్నెనో-చెప్పనలవికాదు. తిట్లుతిట్టిరఁట! నేను, కనులుతెరవని నాపసికూనయు, వారలకేమి విషము పోసితిమి? మావిషయములు వారికెందులకు?

ఇందు—ఇప్పుడేమి సేయుదము? అయిపోయినదానికి మఱల యెందుకు తర్జనభర్జన?

ప్రభా—(కోపముతో) అవును లేండి! మీవాళ్లు నన్నేన్న మీకు సంతోషమే! ఈచీవాట్లకేఁ కాబోలు నేనువచ్చి మిమ్ములఁ జేబట్టినది. నాకర్మము లేండి! మిమ్ములనను టెందులకు? నామూలమునమీరు చెడిపోతిరనకే కనులు తెఱవనిపిల్లవాడు — రత్నసేనుఁ డెవరిని చెడఁగొట్టెను? వానినికూడ యనరానిమాటలన్నియు నను టెందులకు? ఇదియంతయు మీలోనేయున్నది. పిల్లవాడు బ్రతుకుట మీకిష్టములేదు కాఁబోలు!

ఇందు—హరీ! హరీ! యెంతమాటంటివి? ప్రభాకరా! నాప్రాణములలో సగమునీవు, మిగిలినసగము పిల్లవాడు. రత్నసేనునిపై నాకెంతో ప్రేమయున్నది. నిన్నుఁ జేబట్టినందులకు నాకాపిల్లవాడు కలిఁగినందులకు నేనెంత సంతసముతోనుంటిని? మన మిరువురము మరణించినను పిల్లవాడుమాత్రము సుఖుఁడై యుండ భగవానుని గోరుచుంటిని. నిన్నుఁజూచుకొని నేను నా కులము వీడితిని నాతండ్రిని వీడితిని. నాసోదరుని వీడితిని. నాసర్వస్వము వీడితిని. లోకాపవాదముల లెక్కసేయుట వీడితిని. నాబంధుజనములపై ననురాగము నామిత్రులపై ప్రేమ, నాసమస్తదుఃఖభారము వీడితిని. నిన్నే నమ్ముకొనియుంటిని. నీకు రత్నసేనునిపై యెంత ప్రేమయున్నదో నాకంతకంటె రెట్టింపుప్రేమ వానిపైఁ గలదు. నేనువినుచుండఁగా నిన్నుగాని పుత్రుఁడగు

రత్న సేనునిఁగాని పల్లెత్తుమాట నాతల్లిదండ్రులు-నా బంధుజనులు- నామిత్రులు-నాశత్రువులుకాని- యెవరైన ననఁగలరా? అనిన నేపూరుకుందునా? ప్రభాకరా! నిర్హేతుకరముగా నాపై ననుమానము నీవొందవలదు.

ప్రభా—ఏమో లేండి! భగవంతుఁడను గ్రహించిన నాకుఁగాని, నాపిల్లవానికిఁగాని ఏమియును ముప్పుకలుఁగదు.

(అనిలోపలికిఁబోవును)

ఇందు—సంసారభారము సామాన్యుఁడు భరింపవలశినది కాదు కాదు, ముమ్మాటికాదు.

(అనిలోపలికిఁబోవును)

[ తెఱపడును]

---

## మూడవరంగము

ప్రదేశము—కామశాస్త్రి గృహము సంపూర్ణలక్ష్మి గది.

[యోగినీ వేసమున సంపూర్ణలక్ష్మి యాలోచించుకొను చుండును]

మోహము నిరంకుశము. ఎంతవారినైన బాధించును. ఘోరకృత్యములఁ జేయించును. సోదరుఁడగు యిందుశర్మ ప్రవర్తన ప్రభాకరునిఁ జేఁబట్టినది మొదలు పూర్తిగమారి పోయినది. మోహమే కారణముగదా! విజ్ఞానచంద్రుఁడగు యిందుశర్మ తుచ్ఛపు నైహిక భోగములకై మందమతియై యిట్టి హైన్యస్థితికి వచ్చునని కలనైన దలఁపనైతి. అదికాల

మహిమకదా! నాభుక్తిగడచుటకై యిందుశర్మకాని, ప్రభాకరగాని చెప్పిన చొప్పున నేనువర్తింపవలసి వచ్చుచుండెను. కానిమ్ము ఇటులెంతకాలము జరుగునో చూచుచుండెదను.

[శర్వాణి ప్రవేశము.]

సంపూర్ణ లక్ష్మి.

సంపూ— శర్వాణీ! నమస్కారము. (అనినమస్కరించును.)

శర్వా— నేను వెళ్ళవలయును ఒక రహస్యము చెప్పెదను.

సంపూ— ఏమి? ఏమి? రహస్యమేమి?

శర్వా—ఇందుశర్మ యింపుమకత్తె ప్రభాకర యెవరో యెఱుగుదువా?

సంపూ—యోగదృష్టి యనుగ్రహింపుము.

శర్వా— అదివలదు. నేను చెప్పెదను. మీయిరువురకు తల్లి నిక్కముగా తల్లి. ముమ్మాటికి తల్లి.

సంపూ— (ఆశ్చర్యముతో) ఇందుశర్మకు, నాకును తల్లి ప్రభాకరయా?

శర్వా—అవును,

సంపూ—చిత్రము. అంతయు చిత్రము, లోకము చిత్రము. భగవన్నిర్మాణము చిత్రము.

శర్వా—నేను పోవుచుంటిని?

సంపూ—ఎక్కడకు?

శర్వా— చెప్పను.

సంపూ- నేను రావలదా?

శర్వా— వలదు.
సంపూ— ఇంక నేమిమైన రహస్యములు చెప్పెదవా?
శర్వా— సమయము వచ్చినప్పుడు వచ్చి చెప్పెదను.
సంపూ— సరి పొమ్ము.

(శర్వాణి నిష్క్రమించును.)

సంపూ— ప్రభాకర నాకుతల్లి. ఇందుశర్మ మిగుల పాపాత్ముఁడు. వానిపాప మపారము. భగవత్సంకల్పితము. లోకనింద్యము. వానికి మొదట సోదరి భార్య. తరువాత తల్లి. హరి! హరీ! ఏమి ఘోరము? కామశాస్త్రిగారి కిందుశర్మ యెటుల లభించెనో, సోమవధానులగారికి నేనెటుల లభించితినో, మాకీసువురకు పరిణయ మెటులాయెనో? లోకము మాయకదా! మాయలోమునిఁగినవారలకు పుణ్య పాప భేదములు కన్పడునా? మమ్ముద్ధరించుచున్న యీశర్వాణి యోగినీమణి యెవతో? చిత్రము, చిత్రము. చి-త్ర-ము.
(అని యూరకుండును.)

[ప్రభాకర ప్రవేశించి]

సంపూర్ణలక్ష్మి! రత్నసేనుని నిదురఁ బుచ్చుము. నేను పనిమీఁదఁ బోవుచుంటిని.
సంపూ— సరి! పొమ్ము.
ప్రభా— వచ్చుచున్నవాఁడు. నీవు వేగమే రావలయును.
సంపూ—అటులనే వచ్చెదను.

(అని యిరువురు లోపలికిఁ బోవుదురు)

[తెర పడును]

## నాల్గవ రంగము.

(ప్రదేశము—కామశాస్త్రి గృహము.)

[రత్నసేను నూయెలలోఁ బరుండఁబెట్టి సంపూర్ణలక్ష్మి నిదురఁ బుచ్చుచుండును]

సంపూ—రత్నసేనా!

తే॥ గీ॥ తనయ ! తమ్ముఁడ ! నాపిన ♦ తండ్రి ! మఱది !
పౌత్ర ! మామ ! మేనల్లుఁడా ! ♦ భయము లేదు
నిద్రపోవుము వేగంబు ♦ నెమ్మితోడ
నదిగో వచ్చుచున్నది తల్లి ♦ యాఱవువదలు.

నాయనా! నిదురఁబొమ్ము.

(ఇందుశర్మ ప్రవేశించి)

సోదరీ! సంపూర్ణలక్ష్మి! పిల్లవాని నిన్నివిధముల సంబోధించితివేమి ?

సం—సోదరా ! ఇందుశర్మా! అజ్ఞానాంబుధినుండి గట్టెక్కుచుంటివా? నీ హృదయాభిప్రాయములు మారుచున్నవా ? నీ దురదృష్టదేవత నిన్ను వీడుచున్నదా? ధర్మాధర్మ విచక్షణఁ జేయుచుంటివా? నీ నిరంతర కుశమోహ మంతరించినదా ? నీకలఁత లడంగినవా? నాప్రశ్నలకు సమాధాన మిమ్ము.

ఇందు—[ఆశ్చర్యముతో] సంపూర్ణలక్ష్మి! నీమాటలు నాకు బొత్తుగా నర్థమగుట లేదు.

సం—సోదరా! నీ కర్మము కాదు. నీది మందబుద్ధి. నీ తెలివి తేట లడుగంటినవి. నీవు లోకము మఱచితివి. నీపాపములు నిన్ను బాధించుచున్నవి. కళంక పూరితము—కష్టభరితమగు నీమోహము నిన్ను పాయకున్నది. ఈ జన్మమునకు నీవిఁక ధన్యుఁడవు కాఁజాలవు. నీయోగ్యత, నీసద్గుణ సంపన్నత, నీ ధీకుశలత, నీ పరోపకార పారీణత, యిన్ని యేల, నీ సర్వస్వము నశించినది. కాని మోహము నశింపలేదుకదా! ఈ మోహమే నిన్నధోగతిపాలు చేయనున్నది. ఇఁకనైన మేల్కాంచుము.

సీ॥ ఏలేమ నీకు రెం ♦ డేడ్లనుండియు పత్ని
గా సౌఖ్యములఁ గూర్చి ♦ గ్రాలుచుండె?
నేభామ కోర్కెల ♦ నెలమిమైఁ దీర్పంగ
ధరణి కంతయు నీ ♦ వరుఁడవైతి?
వేకాంతఁ జేఁబట్టి ♦ యింతకాలమునుండి
మోహవారాశిలో ♦ మునుఁగుచుంటి?
వేనారికతన ♦ జ్ఞానంబు పెంపొంద
మాయచే సర్వంబు ♦ మఱచినావు?

తే. గీ. ఏతలోదరినేలి సం ♦ ప్రీతినీవు
రత్నసేనునిఁబడసి గ ♦ ర్వమునసుంటి?
నాలతాంగి ప్రభాకర ♦ యరయనీకు
తల్లియగుఁగాని తగ కళ ♦ త్రయుంబుకాదు.

ఇందుశర్మా! తెలిసినదా?

ఇందు—[ ఆశ్చర్యముతో ] సంపూర్ణలక్ష్మీ! ప్రభాకర మన తల్లియా? ఇదియేమివార్త?

సంపూ - సోదరా! నిక్కముగా మనకు తల్లి. మనమిరువురమూ మాపెకు బిడ్డలము. నీవింక నజ్ఞానాంబుధినుంటివి. నీవాచరించుచున్న వన్నియు దుష్కృతంబులని యెఱుఁగఁజాలకున్నావు. నీతలంపుల మార్పుఁజేసుకొనుము. యోగ్యుఁడవగుటకు యత్నించుము. సద్గుణపుంజము నార్జింపుము. లోకవంద్యుఁడవుకమ్ము. నామాటలఁ ద్రోసి వేయకుము.

ఇందు - సోదరీ! యీమాటలన్నియు నీ వెందులకు చెప్పుచుంటివో నేను గ్రహింపఁజాలకున్నాను కదా!

సంపూ - ఇందుకళా! నీవిఁక గ్రహింపఁజాలవు. ఈ భూలోకమే నీకు నరకము. నీపాపపిశాచములు నిన్నిఁక విడువఁజాలవు. నీవేమి యనుభవింప నుంటివో యంతయు నీభూలోకముననే యనుభవింపుము. నేను నీకిఁక నేమియుఁ జెప్పను. ఇఁక నీయింటఁగూడ నుండను.

ఇందు - చెల్లెలా! కాఠిన్యమెందులకు? ప్రభాకర మనకు తల్లియా?

సంపూ - నిక్కముగా!

ఇందు - (ఆలోచించుకొను చుండును.)

సంపూ - ఏమి యాలోచించెదవు?

[ ప్రభాకర ప్రవేశము ]

సంపూర్ణలక్ష్మి! పిల్లవాని నిదురఁ బుచ్చితివా?

సంపూ - ఆ! నిద్రపోయిన వాడు

ఇందు - (ప్రభాకర కాళ్ళమీదఁబడి) తల్లీ! రక్షింపుము. అజ్ఞానుఁడ. నాపాపములన్నియు భగవత్సంకల్పితములు.

సంపూ - (ప్రభాకర కాళ్ళమీఁదఁబడి) తల్లీ కాపాడుము మేమి
రువురము నీదుబిడ్డలము. మా పాపము లపారములు.

ప్రభా—(ఆశ్చర్యముతో) ఇదియేమి !

[శర్వాణి ప్రవేశము.]

ప్రభాకరా ! ప్రథమవిటుఁడగు ప్రతాపునివలనఁ గలిఁగిన ప్రథమ పుత్రకుఁడు నీ కీయిందుశర్మయే ! అరణ్యమధ్యప్రదేశమున నీతనిఁ బాఱవైచి పోతివి. కామశాస్త్రియను బ్రాహ్మణుఁ డీతనిఁ బెంచి పెద్దవానినిఁ జేసెను. ఈ సంపూర్ణలక్ష్మి నీ ద్వితీయవిటుఁడగు దేవయానునివలన నీకుఁ గలిఁగిన పుత్రిక. ఈపె నరణ్యమధ్యమునఁ బాఱవైచి పోతివి. సోమావధానియను బ్రాహ్మణుఁ డీపెనుఁ బెంచి పెద్దదానినిఁ జేసి యీ యిందుశర్మ కిచ్చి వివాహముఁ గావించియున్నవాఁడు. నే నిచ్చిన యోగదృష్టిచే సంపూర్ణలక్ష్మి వృత్తాంత మంతయు గ్రహించి వైరాగ్యవృత్తికి దిగినయప్పుడు నీవు వచ్చి యిందుశర్మను జేఁబట్టితివి. ఇందుశర్మ, సంపూర్ణలక్ష్మియు నీ కనుంగుబిడ్డలు. ముమ్మాటికి బిడ్డలు.

ప్రభా—(శర్వాణి కాళ్ళమీఁదఁ బడి) యోగినీమణీ ! క్ష
మింపుము.

శర్వా—(లేవఁదీసి) ఇది యంతయు భగవత్సంకల్పితమే !
నేనిఁకఁ బోయెదను.

ప్రభా—ఎక్కడకుఁ బోయెదవు ?

శర్వా— చెప్పను.

ఇందు, సం—[శర్వాణి కాళ్లమీఁదఁబడి] శర్వాణీ! మమ్ములఁ
గాపాడినదానవు నీవు. నీఋణ మమూల్యము.

ఆజన్మాంతము మమ్ముల నిటులనే వచ్చి రక్షింపు చుండుము.

శర్వా—[లేవఁదీసి] భగవంతుఁడే! నే నిఁక నిలువఁజాలను. శీఘ్రమే పోవలయును. (అని నిష్క్రమించును)

ప్రభా—(కుమారుని కౌఁగిలించుకొని) నాయనా! పాపా త్ముఁరాలను. (కుమార్తెను కౌఁగిలించుకొని) నాచే తు లెట్లాడెనో మీయిరువురఁ గనులు తెఱువక మునుపే గహనమధ్యముల పారవైచితిని. ఆభగవం తుఁడే మిమ్ములఁ గాపాడి నాకు మంచిబుద్ధి చెప్పినా డు. ఈవృత్తాంత మంతయుఁ గామశాస్త్రిగారికి సో మావధానిగారికిఁ దెలియఁజేయుదము.

ఇందు, సం—అటులనే!

(అని యందఱు లోపలకుఁ బోవుదురు.)

(తెఱ పడును)

ఐదవ రంగము.

ప్రదేశము:— సోమావధాని గృహము.

[ కామశాస్త్రి, సోమావధాని మాటలాడు కొనుచుందురు. ]

కామ- అవధానులూ! ప్రభాకర వృత్తాంతమంతయు నాశ్చ ర్యకరముగా నున్నదయ్యా!

సోమా-శాస్త్రీ! అదియంతయు భగవంతునిమాయ. ఏమి! ఏమి!! అంతయు చిత్రమే! ఇట్టి చిత్రము లోకము లో నెక్కడైన జరిఁగినదా?

కామ- లేదు. లేదు. ఇంకొక చిత్రమున్నది.

సోమా— ఏమి ? అదియేమి ?

కామ- ఈకథనంతయు నొక పండితుఁడు సమస్యక్రిందఁబూ
ర్తి జేసినాడు.

సోమా- ఏదీ శ్లోకముఁ జదువుము.

కామ- సరిగా వినుము.

శ్లో. జారోత్పన్నా విస్పష్టాతనయదుహితరౌ దంపతీ దైవయోగా
ద్యోగిన్యాగర్భితా సాతదనుగమవశాద్యోగినీత్వం ప్రపేదే
పశ్చాద్వేశ్యీకృతాం బాజనితమథశిశుంలాలయంత్యబ్రవీత్యా
(భ్రాతర్భాతృవ్యపౌత్రాశ్వశురసుతపితృవ్యేతితం దేవరేతి.)

సోమా- బాగానే యున్నది.

కామ- ఈ పాత్రలలో నెవరికైన నిజవృత్తాంతము తెలసిన
యిట్టియవమానుష కృత్యములకు సాహసింతురా?

సోమా-సాహసింపరు. సాహసింపరు.

కామ-మనకుమాత్రము హృదయపరితాపము లడంగినవి.
సమస్తవాంఛలు తీరినవి- ఇంకేమికావలయును?
అయినను

* భరతవాక్యము *

తే॥ గీ॥ జారవృత్తియడఁగుఁగాక * జగములందు!
పంటలన్నియు బాగుగఁ * బండుఁగాకఁ
కరముధర్మంబువర్థిల్లుఁ * గాకసతము!
న్యాయపాలనభూమీశు * లలరుఁగాక!

సోమా-తథాస్తు-

సంపూర్ణము.